13.1.1995 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 67, సంచిక : 2, వెల రు. 2.00 లు

Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



### ఒకే ఒక్క మాటతో గాలి తీసేసింది లక్ష్మీపార్వతి!

# చంద్రబాబు చిల్లి గవ్వే!

రాష్ట్ర రాజకీయాలలో, తెలుగుదేశం పార్టీలో, ప్రభుత్వ నిర్వహణలో తన పాత్ర, ప్రమేయం ఎటు వంటివో రాష్ట్ర ప్రజలందరకూ అర్థమయ్యే టట్లు చెప్పడానికి ఎన్టీఆర్ సతీమణి శ్రీమతి లక్ష్మీపార్వతి తన విజయవాడ పర్యటనను చక్కగా వినియోగించు కున్నారు. మద్రాసుకు చెందిన ప్రముఖ పట్టు చీరల వ్యాపార సంస్థ నల్లీస్ విజయవాడలో తమ బ్రాంచి ప్రారంభానికి శ్రీమతి లక్ష్మీపార్వతిని ఆహ్వానించారు. ఎన్టీఆర్ ప్రక్కన లేకుండా హైదరాబాదు దాటి ఇతర ప్రదేశాలకు రావడం శ్రీమతి లక్ష్మీపార్వతికిది రెండవ పర్యాయం. మొదట జరిపిన తిరుపతి పర్యటనలో ఆమె ఆరుగురు మంత్రులను తన బాడీ గార్డుల వలె తన వెంట కాలి నడకన తిరుమల వరకు నడిపించారు. విజయవాడ పర్యటనలో తనకు జరిగే ఏర్పాట్లు, అచ్చు ముఖ్యమంత్రికి వలె వుండాలని ఆదేశించారామె. ఆమెకు ప్రభుత్వంలో ఎటువంటి హోదా లేకపోయినా, ఆమె పాల్గొన్న కార్యక్రమమూ కేవలం వ్యాపార సంస్థ ప్రారంభమైనా అధికారులు అగ్గగలాడి పోయారు. ఆమె కారు వెళ్లే రోడ్లలో ట్రాఫిక్ నిలిపి వేశారు. దారి పొడవునా పోలీసు బందో బస్తు చేశారు. సభ జరిగే ప్రదేశంలో పెద్ద పెద్ద అధికార్లు నిలబడి ప్రభుత్వ గుర్తింపు కార్డులున్న పాత్రికేయులను సైతం వేధించారు. పార్టీ, ప్రభుత్వ పదవుల్లో వున్న వారిని కూడా ప్రక్కకు నెట్టేశారు. సాక్షాత్తు ముఖ్యమంత్రి వస్తే ఎట్లా ప్రవర్తిస్తారో, అదే భక్తి శ్రద్ధలతో అమ్మ గారిని సేవించి, తరించారు. అతిథి గృహం వద్ద కలెక్టర్ నుంచి డిఐజి వరకు అందరు అధికారులూ పడిగాపులు కాశారు.

ముఖ్యమంత్రి భార్య అయినంత మాత్రాన ఆమెకు ఇంత హంగామా సృష్టించడం విమర్శలకు దారి తీసింది. ప్రజలూ విసుక్కున్నారు. అయితే కథ ఇంతటితో సరిపెట్టుకొని వుంటే పెద్దగా చర్చ జరిగి వుండేది కాదు. కాని కథ ఇక్కడి నుంచే మొదలు కావడంతో ఈ పర్యటన రాష్ట్రమంతా సంచలనం సృష్టించింది.

### "ఇద్దరు మగవాళ్లు చేయాల్సిన పని ఆయనొక్కడికి అప్పచెప్పాం; అది చాలదా?"

ప్రారంభోత్సవానికి వెళ్లబోతున్న ఆమెను, అక్కడ గుమికూడిన తెలుగుదేశం కార్యకర్తలు, మహిళలు నినాదాలతో స్వాగతించారు. ఎన్టీఆర్ జిందాబాద్ నినాదాలు మామూలుగా వుండినాయి. ఈలోగా ఒక మహిళ లక్ష్మీపార్వతిని రాష్ట్ర నేతగా సంబోధిస్తూ ఒక నినాదం చేసింది. అంతే ఆ నినాదం చెవిన పడగానే లక్ష్మీపార్వతి గారు గబ గబా వెనక్కు నడిచి వచ్చి, ఆ మహిళను సమీపించి, చేతిలోని బొకె ఆమెకు ఇచ్చి, పలుకరించి వెళ్లారు. ఈ పరిణామంతో అందరూ ఎన్టీఆర్‌ను, తెలుగుదేశం పార్టీని వదిలేసి లక్ష్మీపార్వతి జిందాబాద్ అంటూ హోరెత్తించేశారు.

సభ నుంచి తిరిగి వెళ్లబోయే సమయంలో తనను కలిసిన పత్రికల వారితో ఆమె చిన్నల్లుడు చంద్రబాబు నాయుడు గురించి చేసిన వ్యాఖ్యలు మరీ వివాదాస్పద మైనాయి. అంతకు క్రితం రోజే చంద్రబాబు నుంచి ప్రణాళికా శాఖను తప్పించి, ఎన్టీఆర్ తాను తీసుకున్నాడని వార్తలు రావడంతో పత్రికల వారామెను అందుకు కారణం అడిగారు. దానికి ఆమె పెద్ద కథ చెప్పింది.

చంద్రబాబుకు వ్యవసాయ శాఖ ఇద్దామను కున్నాముని, కాని ఆయన రెవిన్యూ కావాలని మురిపెంగా అడగడంతో అల్లుడి కోరిక తీర్చామని చెప్తూ "ఆర్థిక, రెవిన్యూ శాఖలంటే ఇద్దరు మగవాళ్లు చేసే పని; దాన్ని అప్ప చెప్పాం. చాలదా?" అని విలేఖరులను ఎదురు ప్రశ్నించారామె.

ఈ ఒక్క మాటతో శ్రీమతి లక్ష్మీపార్వతి - చంద్రబాబును చిల్లి గవ్వతో సమానంగా మార్చి పారేశారు. తమ దయా ధర్మంతో మంత్రిగా బ్రతుకు తున్నాడనే అర్థం వచ్చేటట్లు మాట్లాడి గాలి తీసేశారు.

ఈ వ్యాఖ్య రాజకీయ సంచలనానికి దారి తీసింది. మంత్రిత్వ శాఖల కేటాయింపు ముఖ్యమంత్రి స్వంత బాధ్యత. అందులో తాను చెప్పిన ప్రకారం ముఖ్యమంత్రి నడుచు కున్నారని లక్ష్మీపార్వతి గారు చెప్పడం వల్ల ముఖ్యమంత్రి కూడా చులకనై పోయారు. అది చట్ట వ్యతిరేకం కూడా! ఈ ప్రమాదం పసిగట్టి పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వర రావు ఆమె అలా అనకుండా వుండవలసింది అని ప్రకటించారు; ఆమె చేత కూడా మంత్రిత్వ శాఖలు కేటాయించడంలో తాను జోక్యం చేసుకున్నానని తాను అనలేదని ఆమె మరొక వివరణ ఇచ్చారు.

ఈ ప్రకటనలతో పాపం చంద్రబాబు మరీ చులకనై పోయారు. ఇప్పటికే ఆయన్ను ప్రభుత్వ నిర్వహణలో, పార్టీ వ్యవహారాలలో

7వ పేజీలో




# కాంగ్రెస్ తోక వంకరే!

శాసనసభలో కాంగ్రెస్ పక్ష నాయకుడిగా ఎవర్ని ఎంపిక చేయాలనే వివాదం పెరిగి పెద్దదై, రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు మరొకసారి బహిరంగంగా ముఠా కుమ్ములాటలకు దిగారు. శాసన సభలో కాంగ్రెస్‌కు ప్రతిపక్ష స్థానం ఇవ్వడానికి ముఖ్యమంత్రి శ్రీ ఎన్‌టి రామారావు నిరాకరించారు. "ప్రజలే వారిని ప్రతిపక్షంగా కూడా వుండడానికి అనర్హులని ప్రక్కన పారేశారు; ఇంక మేమెందుకు వారివా స్థానంలో కూర్చోబెట్టాలి" అన్నారాయన. ప్రతి పక్షం స్థానం లేకుంటే, శాసన సభా నాయకుడికి ఎటువంటి ప్రత్యేక గుర్తింపూ వుండదు. క్యాబినెట్ హోదా లభించదు. అంతే కాకుండా, అసెంబ్లీ భవనంలో సాధారణంగా బిజెపి, సిపిఎం వంటి పార్టీలకు ఇచ్చే చిన్న గదిని మాత్రం కాంగ్రెస్‌కు కేటాయించారు. ప్రతి పక్షంలో వుండే

### కోట్ల, వైఎస్‌లకు ఇంకా ఏ మాత్రం బుద్ధి రాలేదు!

పెద్ద పార్టీ కోసం నిర్మించిన విశాలమైన హాలును ఇవ్వలేదు. ఈ రెండింటి దృష్ట్యా సిఎల్‌పి నాయకుడికి అసెంబ్లీ లోపల కాని, బయట కాని ఎటువంటి గుర్తింపు విలువ వుండవు. అటువంటి విలువ లేని పదవికి కూడా పోటీ, పోట్లాట అంటే, కాంగ్రెస్ తోక ఇప్పటికి ఎంత వంకరగా వుందో అర్థం చేసుకోవచ్చు.

సిఎల్‌పి సమావేశంలో ఈ విషయమై ఏకాభిప్రాయం సాధించ డానికి పిసిసి అధ్యక్షుడు శ్రీ కమాలుద్దీన్ పాపం చాలా శ్రమ పడ్డారు. సీనియర్ నాయకుడైన కోట్ల విజయ భాస్కర రెడ్డిని ఆ సీట్లో పెట్టేస్తే సరి పోతుందని చాలా ప్రయత్నించా రాయన. పి. జనార్ధన్ రెడ్డి ఆ మేరకు ప్రతిపాదన చేశారు. కాని, అందుకు వైఎస్ వర్గం ఒప్పుకోలేదు. శ్రీ సాంబయ్యను వారు ప్రతిపాదించారు. రాజీ కుదర లేదు

7వ పేజీలో

# రాజీ ఉత్తుత్తిది- సర్దుబాట్లే శరణ్యం!

నెల్లూరు జిల్లా పర్టీనా కాంగ్రెస వాదుల మధ్య ఐక్యత సాధించాలని వివిధ వర్గాలు జరిపిస్తున్న ప్రయత్నాలు ఫలించడం లేదు. మాగుంట వర్గం తమ తరపున దూతగా శ్రీ మాదాల జానకిరాంను నియమించింది. ఆయన ఇంకా జనార్ధన రెడ్డిని కాని, ఆనం వర్గాన్ని కాని సంప్రదించినట్లు లేదు. జానకి

### జిల్లా కాంగ్రెస్ రభసీయం!

రాంను రాయబారిగా వినియోగించడంలో మాగుంట వర్గం ఉద్దేశ్యాలు సూచన మాత్రంగా కన్పిస్తున్నాయి. జానకి రాంకు ఆనం వర్గంతో, ముఖ్యంగా సంజీవ రెడ్డి గారితో అంత సత్సంబంధాలు లేవు. మొన్నటి ఎన్నికల్లో కూడా ఇద్దరి మధ్య పత్రికా ప్రకటనల యుద్ధం నడిచింది. అందువల్ల ఆయన వారితో అంత చనువుగా మాట్లాడ లేదు. ఇది తెలిసీ జానకి రాంను దూతగా గుర్తించడమంటే వారికి జనార్ధన రెడ్డితో మాత్రం నెయ్యం సమ్మతమని భావించాలి. అయితే మాజీ ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి ఆనం వారితో సంప్రదిస్తున్నారు. అయితే ఆయనకు మాగుంట వర్గం తరపున అందరితో మాట్లాడే స్వేచ్ఛ లభించినట్లు లేదు. ఆనం సంజీవ రెడ్డి గారితో రాజీ తనకసాధ్యమని సుబ్బరామ రెడ్డి గారు వ్యక్తం చేశారట. అవసరమైతే, ఇందిరా భవన్‌లో తమ అనుచరులను కొట్టిన సంఘటనను మర్చిపోయి వివేకానంద రెడ్డి, రామనారాయణ రెడ్డిలతో చేతులు కల్పడానికి మాత్రం సిద్ధమని చెప్పారట. అయితే జెకె రెడ్డికి - మొత్తం మాగుంట వర్గం కాని, విడిగా తాను కాని జనార్ధన రెడ్డితో కలవడం ఇష్టం లేదు. ఈ అవకాశాన్ని వినియోగించుకొని జిల్లా రాజకీయ నాయకత్వం నుంచి జనార్ధన రెడ్డిని తప్పించి, తక్కిన అందరూ కలిసి పని చేయడం అందరికీ మంచిదని ఆయన భావిస్తున్నట్లున్నారు.

ఈ విషయంలో జెకె రెడ్డికి మాగుంట సుబ్బరామ రెడ్డి గారి సోదరుడికి మధ్య చిన్న వివాదం సృష్టించినట్లు కూడా తెలుస్తోంది. ఆయన ఉద్దేశ్యం కలయిక జనార్ధన రెడ్డితోనే వుండాలని! ఆనం రామనారాయణ, వివేకానంద రెడ్డి లిద్దరూ ఎటువంటి రాజీ యత్నమైనా సంపూర్ణంగా వుండాలి తప్ప, వారిని

కరుప 7 పేజీలో




# న్యాయస్థానాలు చేపల బజార్లు కావడం ఎవరికీ గౌరవ ప్రదం కాదు!

నెల్లూరు వినియోగ దారుల ఫోరం ఛైర్మన్ శ్రీ కె. సిద్ధారెడ్డి, ప్రభుత్వ న్యాయవాది శ్రీ కె. పద్మనాభయ్య పరస్పరం కలహించుకొని, పత్రికలకెక్కి బజారున పడ్డారు. ఫోరంలో కేసుల విషయంలో వీరిద్దరి మధ్యా చాలా కాలం నుంచి అభిప్రాయ బేధాలు న్నట్లున్నాయి. అయితే అవి లోలోపలే రాజు కుంటుండినాయి. మొన్న 6 తేది ఉదయం విద్యుత్ శాఖకు చెందిన ఒక కేసుకు సంబంధించి ఇద్దరి మధ్య పెద్ద రగడ జరిగింది. విద్యుత్ శాఖకు కూడా పద్మనాభయ్య అడ్వకేటు. ఫోరంలో విచారణకు వచ్చిన వారి కేసుల్లో ఒక దానిని వాదించమని ఛైర్మన్ ఆదేశించారట. కాని అప్పటికి కౌంటర్ దాఖలు చేయక పోవడంతో పద్మనాభయ్య సమయం అడిగాడట. అందుకు ఛైర్మన్ ఒప్పుకోక పోయేసరికి, మీరిచ్చే ఉత్తర్వులో నేను కౌంటర్ దాఖలు చేయని విషయం, కేసు వాదించని విషయం ఉదహరించమని పద్మనాభయ్య కోరారట. కాని ఛైర్మన్ ఆ విజ్ఞప్తిని విస్మరించి, నేరుగా తీర్పు ప్రకటించారు. మరొక ఫోరం సభ్యురాలు శ్రీమతి నీరజ సైతం ఆ ఉత్తర్వులో సంతకం పెట్టారు. దానితో పద్మనాభయ్య ఆమెను కోర్టులోనే, నేను చేసిన విజ్ఞప్తిని ప్రక్కన పెట్టి, పక్షపాతంగా ఛైర్మన్ తీర్పులు ప్రకటిస్తుంటే మీరెట్లా అందులో సంతకం పెడతారని అడిగాడట. ఇది ఛైర్మన్‌కు ఆగ్రహం తెప్పించింది. ఆయన జోక్యం చేసుకొని పద్మనాభయ్యను దబాయించాడట. ఆయనా వాదానికి దిగారు. ఇద్దరి మధ్యా మాటలు పెరగడంతో ఇతర న్యాయవాదులు జోక్యం చేసుకొని ఇద్దరినీ ప్రక్కకు తీసుక వెళ్లారు.

### వినియోగదారుల ఫోరం ఛైర్మన్, ప్రభుత్వ ప్లీడర్ల వివాదం అనవసరం!

ఈ సంఘటన ఫోరం పని తీరును వీధిలోకి లాగింది. ఫోరం ఛైర్మన్ వెంటనే కలెక్టర్‌కు లిఖిత పూర్వక ఫిర్యాదు పంపారు. పద్మనాభయ్య తనపై దౌర్జన్యం చేయబోయాడని ఛైర్మన్ ఫిర్యాదు చేశారు.

పద్మనాభయ్య ఈ ఆరోపణను తిరస్కరించారు. ఫోరం ఛైర్మన్‌ను తానేమీ దుర్భాషలాడలేదని, పై పెచ్చు ఆయనే తనపై దూసుక వచ్చాడని తాను శ్రీమతి నీరజతో మాట్లాడుతుంటే అనవసరంగా జోక్యం చేసుకున్నారని పద్మనాభయ్య వివరిస్తున్నారు.

మొత్తానికి ఫోరం రభస రచ్చ కెక్కింది. 6 తేది గందరగోళానికి ఛైర్మన్ తొందరపాటే కారణమన్న అభిప్రాయం న్యాయవాదులలో వుంది. ఛైర్మన్ కూడా తగ్గివచ్చి ప్రభుత్వ ప్లీడర్‌కు తనకు మధ్య దినపత్రిక వార్తలు అపార్థాలు సృష్టించాయని, జరిగింది మర్చిపోయి ఇద్దరం కలిసి పనిచేసుకొందాం అని ఆయన ప్రతిపాదించారు.

వినియోగదారుల ఫోరం కూడా కోర్టుతో సమానం. కోర్టుల కుండే న్యాయపరమైన హక్కుల రక్షణ దానికి లేక పోవచ్చుకాని, ప్రజల దృష్టిలో అది న్యాయస్థానం క్రిందే లెక్క. అటువంటి సంస్థ తన హుందాతనాన్ని, గౌరవాన్ని విస్మరించి చేపల మార్కెట్ స్థాయిలో ఘర్షణలకు, రభసకు నిలయం కావడం ఎవరికీ గౌరవం కాదు. ప్రభుత్వం ప్లీడర్ కంటె ముందు, కొద్ది రోజుల క్రితం మరొక న్యాయవాది విషయంలోనూ ఇటువంటి దుర్ఘటన ఒకటి జరిగింది. అప్పుడు అతను ఛైర్మన్‌ను తప్పు పట్టి మట్లాడారు.

న్యాయవాదులు పలువురు కూడా ఛైర్మన్ ప్రవర్తన పట్ల

కరుప 7 పేజీలో

# శేషన్ పిచ్చి ముదిరిందా?

ఐదు ఉత్తరాది రాష్ట్రాలలో ఎన్నికలు జరుగు తున్నందు వల్ల కేంద్ర బడ్జెట్‌ను ఆనవాయితీ తప్పించి, ఫిబ్రవరి 28 తేదీ కాకుండా, మూడు వారాలు ఆలస్యంగా పార్లమెంట్‌కు సమర్పించాలని చీఫ్ ఎలక్షన్ కమీషనర్ శ్రీ టి.ఎన్. శేషన్ ప్రతిపాదించారు. విచిత్రమూ, విడ్డూరమైన సూచన ఇది.

ఐదు ఉత్తరాది రాష్ట్రాలలో శాసన సభ ఎన్నికలు మొదట అనుకున్న ప్రకారం ఫిబ్రవరిలోనే జరిపి వుండాలి. కాని ఫోటో ఐడెంటిటీ కార్డులు పంపిణీ చేయనిదే ఒప్పుకోనని శేషన్ మొండి పట్టు పట్టడం; బీహార్ ముఖ్యమంత్రి శ్రీ లల్లూ ప్రసాద్ యాదవ్ దాన్ని తేలికగా తీసుకోవడం; చివరి నిముషంలో రాజ్యాంగ ప్రతిష్టంభన ఏర్పడుతుందనే భయంతో ఇద్దరూ రాజీకి వచ్చి ఎన్నికలు మార్చికి వాయిదా పడడం జరిగింది. ఇదంతా అయ్యాక శేషన్ బుర్రలో తొల్చింది పురుగు. కేంద్ర బడ్జెట్‌ను సాంప్రదాయం ప్రకారం ఫిబ్రవరి 28వ తేది సమర్పిస్తారు కాబట్టి, అందులో ఓటర్లను ఆకర్షించే పథకాలు ప్రకటించే ప్రమాదం వుంది కాబట్టి, ఎన్నికల వరకు బడ్జెట్ జోలికి పోకుండా వుండాలని శేషన్ మరత పేచీ పెట్టారు; పిచ్చి కుదిరింది, రోకలి తలను చుట్టమన్నట్లుంది వ్యవహారం.

కేంద్ర బడ్జెట్ సమర్పణ ఫిబ్రవరి ఆఖరి రోజు జరపడం యాభై ఏళ్ల సాంప్రదాయం. బడ్జెట్ అంటే మాటలు కాదు. దేశ ఆర్థిక వ్యవస్థ కంతటికి ముడిపడిన రాజ్యాంగ బద్ధ కర్తవ్య నిర్వహణ అది. అదనంగా పన్నులు విధిస్తే - ఆ ప్రక్క రోజు నుంచే అమలులోకి వస్తాయి కాబట్టి బడ్జెట్ సమర్పణ వాయిదా పడితే దేశం అంతమేరా నష్ట పోవలసి వుంటుంది. బడ్జెట్ రూపకల్పనకు మూడు నాలుగు నెలల పాటు ఆర్థిక మంత్రిత్వ శాఖ జరిపే రాత్రింబవళ్ల అధ్యయన కార్యక్రమం చిందర వందరౌతుంది. ఎన్నో లెక్కపక్కలు మారుతాయి. షేర్ల మార్కెట్ విపరీతంగా ప్రభావిత మౌతుంది. ఎగుమతులు, దిగుమతులలో వ్యత్యాసం వస్తుంది. విదేశీ సంస్థలు, పెట్టుబడి దారులు దేశ ఆర్థిక వ్యవస్థ పని తీరు పట్ల సందేహాలు వ్యక్తం చేస్తారు.

మనది చాలా పెద్ద ప్రజాస్వామిక దేశం. సంవత్సరంలో ఎప్పుడూ ఏదో ఒక ప్రాంతంలో ఎన్నికలు జరుగుతూనే వుంటాయి. వాటి సాకు చూపి రాజ్యాంగ బద్ధంగా జరిగి పోవలసిన కార్యక్రమాలను భంగ పరచడం పెద్ద నేరం. ఎన్నికలు నిష్పక్షపాతంగా, నిజాయితీగా జరిపించడం అనవసరమే కాని, ఎన్నికలు ఒక్కటే దేశానికి అవసరమైన కార్యక్రమాలు కావు. ఏదో కొద్ది ప్రాంతానికి పరిమితమైన రాజకీయ అవసరాల కోసం మొత్తం దేశం ఆర్థిక వ్యవస్థతో ముడిపడిన బడ్జెట్ సమర్పణను వాయిదా వేయమనడం మూర్ఖత్వమవుతుంది.

బిజెపి పార్టీ ఒక్కటే శేషన్ చర్యను సమర్థిస్తున్నది. తక్కిన అన్ని పార్టీలూ దీన్ని నిరసిస్తున్నాయి. పది పేను లేదా ఇరవై రోజులు బడ్జెట్ వాయిదా వేస్తే నష్టం లేదని, గతంలో ఇటువంటి సంఘటనలు జరిగి వున్నాయని వాదించే వారున్నారు. కాని గతంలో ఏ పరిస్థితిలో వాయిదా జరిగిందో వారు పట్టించుకోవడం లేదు. 1971, 1972, 1977, 1985 లలో బడ్జెట్ ఆలస్యమైంది. 1971లో, పార్లమెంట్ ఎన్నికలు మార్చి మొదటి వారంలో జరగడం వల్ల, కేంద్రంలో కొత్త ప్రభుత్వం ఏర్పడాల్సిన స్థితిలో పాత ప్రభుత్వం బడ్జెట్ సమర్పించడం సాంప్రదాయం కాదని వాయిదా వేశారు. 1972లోనూ 16 రాష్ట్రాలలో . ఎన్నికలు జరిగిన తర్వాత బడ్జెట్ సమర్పించారు. 1977 లో జనతాదళ్ అప్పుడే ఎన్నికై రావడంతో, బడ్జెట్ రూపకల్పనకు సమయం తీసుకున్నది. 1985 లో ఇందిరా గాంధీ హత్యానంతర పరిణామాలు, పార్లమెంట్ ఎన్నికల వల్ల ఆలస్యమైంది. ఇప్పుడూ పార్లమెంట్ ఎన్నికలు జరుగుతుండి వుంటే శేషన్ అభ్యంతరానికి అర్థం వుండేది. కాని కేవలం ఐదు రాష్ట్రాల ఎన్నికల కోసం ఈ వాయిదా కోరడం అర్థ రహితం, అధికార దుర్వినియోగ ప్రయోగం. పార్లమెంట్ వ్యవహార సరళిలో జోక్యం చేసుకునే అధికారం ఆయనకు లేదు. పార్లమెంట్ అందరు రాజ్యాంగాధి నేతల కంటే ఉన్నతమైన సంస్థ. ఎవరైనా దానికి సేవకులే కాని, దాన్ని శాసించే స్థాయి పొందలేదు.

శేషన్ అభ్యంతరాలను విస్మరించి, ఆనవాయితీ ప్రకారం ఫిబ్రవరి 28 తేదీనే బడ్జెట్‌ను సమర్పించడం కేంద్ర ప్రభుత్వ విధి. శేషన్‌కు పిచ్చి ముదిరితే, అందరూ ఆయన తోటి గంతు లేయవలసిన అవసరం లేదు.

## జమీన్‌రైతు 12-1-1945

## 50 ఏళ్లక్రితం ఈవారం

### పల్లెటూళ్లు

#### బుచ్చిలో -ఈతచెట్లఖూనీ

మాజీ శాసనసభార్యక్షులగు బెజవాడ రామచంద్రారెడ్డిగారికి జన్మస్థలమగు బుచ్చిరెడ్డిపాళెం గ్రామంలో 8తేది రాత్రి 200 ఈతచెట్లను (కల్లుచెట్లు) ఖూనీ చేశారు. వాళ్ల ధర్మాన మనుష్యులను ఖూనీ చేయలేదు. ఈ అకార్యాలకంతా యెవరు కారణకర్తలైంది ప్రజలందరికి తెలియుటమేగాదు, పోలీసు జ్ఞానచక్షువులకు గూడ ప్రత్యక్షవేద్యమే. కాని చర్య జరపడానికి కలెక్టరు, డి.యస్.పి. గార్ల ప్రత్యేక అనుమతిలేనిదే క్రింది ఉద్యోగాలకు అంత గుండెలున్నవా, అనేదే ప్రశ్న?

-పౌరుడు.

### కావలి

పెద్దరెడ్డేరి రైతుసంఘంలో చేరితే చందాలేదట; చందా లేకపోవటమేగాదు, పోలీసోళ్ల భయంగూడా లేదట; పోలీసు భయం లేకుండడమేగాదు, మొన్న ముత్తరాజారైతుకు లభించినట్లు భీమాసురతన్నులు ఘటోత్కచ గుద్దులుగూడా లభిస్తవట. వారేవా!!!

### నెల్లూరు ముచ్చట్లు

#### నెల్లూరు జిల్లాబోర్డు

బడ్జెటు లోటును పూర్తిచేసుకోడానికి, కనిగిరి, సూళ్లూరుపేట హైస్కూళ్లను ఉదయగిరి మిడిల్ స్కూలును ప్రస్తుతం మూసివేయడం విరమించుకున్నారు. ఐతే లోటు భర్తీచెయ్యడానికి విరాళాలు వసూలు చెయ్యుటకున్నూ, 16తేది యమ గర్వభంజనమనే నాటకాన్ని ప్రదర్శించుట ద్వారా ధనాన్ని సేకరించుటకున్నూ, తీర్మానించుకున్నారు. సభ్యులందరూ తలా కొన్ని విరాళాలుగూడ వేసుకున్నారు.

వచ్చే సంవత్సరంలో ఒక శిశుసంరక్షణాలయం ప్రారంభిస్తారట. కావలిలో హిందీ, గూడూరు, కావలి హైస్కూళ్లలో చేతిపనులు శిక్షణ తరగతులు కొనసాగించుటకు తీర్మానించారు. ఇవి 10 తేది జిల్లాబోర్డు మీటింగు సందర్భంలో జరిగిన ముఖ్య విషయాలు.

### అవీ-ఇవీ

"భిక్షంపెట్టకుంటే మానె కుక్కను కట్టెసుకో" మన్నట్లు 3 తేదిన నవాబుపేట సత్రాల రుక్మిణమ్మగారు గొబ్బిదట్టేవారికి భిక్షం పెట్టకుంటే మానె వేడినీళ్లెత్తి పోసిందట. 6 తేది ఈ సత్కార్యానికి ఆమెగారిని బెంచికోర్టువారు 5రూ. జరిమానాతో బహూకరించారు.

* * *

నెల్లూరు హిందూ-మహమ్మదీయ గలాటాల రూపేణా సంవత్సరానికి 50వేలుగుంజే ప్యూనిటివ్ పోలీస్ ( ఎస్.ఇ.ఎఫ్) లైనులో 8 తేది రాత్రి ఒక పెద్ద గల్లంతు జరిగింది.

మరవ 10 పేజీలో

# పేదల బియ్యం పేరుతో మధ్య తరగతి నడ్డి విరిచారు!

ఎన్టీ రామారావు గారి ఆకర్షణీయమైన వాగ్దానాల వలలో పడి ఆంధ్ర ప్రజలు ఆయనకు అధికారాన్ని కట్టబెట్టారు. ప్రమాణ స్వీకారోత్సవ సభలో సంపూర్ణ మద్య నిషేధాన్ని ప్రకటించి ఆడపడుచుల అభిమానాన్ని కూడా పొందారు. అన్నగారు వాగ్దానాలు చేసేముందు ఆర్థిక భారాన్ని పెద్దగా ఆలోచించ లేదు. ఇప్పుడేమో కేంద్ర ప్రభుత్వమే ప్రజా సంక్షేమ పథకాల కయ్యే ఖర్చంతా భరించా లంటున్నారు. బియ్యం పథకానికి దాతలు ఉదారంగా విరాళాలు ఇవ్వమంటున్నారు. పథకం భారం మోయ వలసింది మధ్య తరగతి కుటుంబీకులే. కొత్తగా పెరిగిన వివిధ వస్తువుల ధరలు, త్వరలో వడ్డించనున్న పన్నులు తలచుకొంటే భయమేస్తున్నది. రామారావు చేసిన తెలివి తక్కువ వాగ్దానాలకు అయ్యే వ్యయాన్ని మధ్య తరగతియు లెందుకు భరించాలి? గతంలో ఉప ప్రధానిగా వున్న దేవీలాల్ రైతులకు పదివేల లోపు రుణాలు మాఫీ చేయడం వల్ల దేశం ఎంత ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొందో అందరికీ తెలుసు. చీప్ పాపులారిటీ, ఏదో ఒక రకంగా అధికారం హస్తగతం చేసుకొను రాష్ట్ర ఖజానాను ఖాళీ చేసేముందు నాయకులు ముందు వెనుక ఆలోచించి వాగ్దానాలు చేయడం మంచిది.

నెల్లూరు - పి.వి.రమణయ్య

### ప్రసన్నా... ఈ పనులు చేయించాలయ్యా!

ప్రసన్నకుమార్‌రెడ్డిగారూ- జిల్లా నుండి మంత్రులైన వారు, ముఖ్యమంత్రులైన వారు తమ శక్తి మేర పనులు చేసి జిల్లా అభివృద్ధికి

## జనవాణి

తోడ్పడ్డారు. అందరికంటే చిన్న వయస్సులో జిల్లా మంత్రిగా, నల్లపురెడ్డి శ్రీనివాసులు రెడ్డి వారసునిగా ఎన్టీఆర్ మీకు మంత్రివర్గంలో స్థానం కల్పించారు. అయినా ఇంకా ఎన్నో కొరతలున్నాయి. జిల్లా ప్రజలకు మెడికల్ కళాశాల కోరికగా మిగిలి పోయి వుంది దాన్ని మీరు తీర్చాలి. తెలుగు గంగను వెంటనే పూర్తి చేయించడం, పంబలేరు బ్రిడ్జి నిర్మాణం చేపట్టాలి. నాయుడుపేట వద్ద స్వర్ణముఖి మీద బ్రిడ్జి పని వెంటనే పూర్తి చేయించడం, గూడూరు నిమ్మ రైతులకు కోల్డ్ స్టోరేజి ప్లాంట్‌ను ఏర్పాటు చేయించడం మీ బాధ్యతగా భావించాలి. రైతులు పండించుకొన్న ధాన్యానికి ఆంక్షలు లేకుండా ఇతర రాష్ట్రాలలో అమ్ముకొనే పద్ధతి కోసం అవసరమైతే ప్రభుత్వంతో పోరాడాలి. చెరకు ఫ్యాక్టరీలలో వస్తున్న మొలాసిస్ రాబడిలో రైతులకు వాటా ఇవ్వడం తోపాటు చెరకు ధర పెంపుదలకు కృషి చేయాలి. ఈ పనులన్నీ మీరు చేసిన నాడు తండ్రిని మించిన తనయునిగా జిల్లా ప్రజల చేత కీర్తింప బడుతారు.

కోట - పి.గోపాల్‌రెడ్డి

### మునిసిపల్ అధికారుల పక్షపాతం!

నెల్లూరు బాలాజీ నగర్ మూడవ మెయిన్ రోడ్డులో వున్న రోడ్ల

మరవ 11 పేజీలో

రమేష్‌రెడ్డి ధీమా!

# "పై ఎన్నికల్లో కాంగ్రెస్ ఓట్లూ నాకే పడతాయి"

నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్ రెడ్డిలో ఆత్మవిశ్వాసం అంతకంతకూ పెరుగుతూంది. మంత్రగణం వంటి మాగుంట కుటుంబీకుడ్ని ఓడించడం, గెల్చిన తర్వాత వీధివీధిలో తెలుగు కార్యకర్తలు అట్టహాసంగా సన్మానాలు, సభలు జరిపించడం, ఎన్టీఆర్ అభిమాన పుత్రుడనే భయంతో పెద్ద పెద్ద అధికార్లు సైతం భయభక్తులతో మెలగడం రమేష్‌రెడ్డిలో ధీమాను పెంచుతున్నాయి. ఆయన ఉపన్యాసాలలో అది కొట్టొచ్చినట్లు కన్పిస్తూంది. వచ్చే ఎన్నికల్లో గెలుపు గురించి కూడా ఇప్పుడే మాట్లాడేస్తున్నాడాయన. 6 తేదీ మూలపేట రావిచెట్టు సెంటర్ వద్ద జరిగిన సన్మాన సభలో గతంలో నెల్లూరు నుంచి ఎన్నికైన ఎమ్మెల్యేలపై విమర్శల వర్షం కురిపించారు. నెల్లూరు ఎమ్మెల్యేలు ఎన్నిసార్లు ప్రజల ముందుకు వచ్చారు. కేవలం ఎన్నికలప్పుడు మాత్రం ఇంటింటికి తిరిగి తర్వాత కనిపించకపోవడం వారితత్వం. అయిదేళ్ల కాంగ్రెస్ పాలనలో పట్టణాభివృద్ధి ఆగిపోయింది. నేను మునిసిపల్ ఛైర్మన్‌గా వున్న సమయంలో కౌన్సిల్ ద్వారా తీర్మానించిన మూడు కోట్ల రూపాయల పనులు ఆగిపోవడానికి ఒక ప్రజా ప్రతినిధే కారణమని రమేష్ రెడ్డి విమర్శించారు. తాను ఎమ్మెల్యేగా ఎన్నికైనప్పటి నుంచి నిరంతరం టౌన్‌లో పర్యటిస్తూ ప్రజల సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నానని; ఇప్పటి వరకు 28 వార్డులు పర్యటించానని చెప్పారు. మునిసిపల్ ఎన్నికల్లో మొత్తం 44 వార్డుల్లో టిడిపి, మిత్ర పక్షాల అభ్యర్థులను గెలిపిస్తే ఎక్కడా లేని అభివృద్ధి చేసి చూపిస్తాను. కాంగ్రెస్ అభ్యర్థికి మీరు వేసిన 53 వేల ఓట్లు కూడా పై ఎన్నికల నాటికి తిరిగి తెచ్చుకొంటానని రమేష్ రెడ్డి ధీమాగా చెప్పారు. . మాజీ కౌన్సిలర్లు అరిగెల కోదండ రామయ్య, లక్ష్మీకుమారి, శైలేంద్ర బాబు, సంక్రాంతి కళ్యాణ్ ఈ సభలో పాల్గొన్నారు. గుంటూరు సుధాకర్ విచిత్ర వేషధారణ కార్యక్రమ వీక్షణాంతరం రమేష్ రెడ్డి మూలస్థానేశ్వర ఆలయంలో పూజలు చేశారు.

## నెల్లూరు సంగతులు

### ఎస్.పి వీడ్కోలు సభ

ఇటీవలే బదలీపై వెళ్ళిన సూపరింటెండెంట్ శ్రీ రమణమూర్తి గారికి వివాదాస్పదుడని పేరు. ఆయన నెల్లూరుకు రావడంతోటే, పలురకాల వివాదాల కారకుడుగా ప్రచారంతో వచ్చారు. ఆయన పని చేసిన 13 నెలల్లో జిల్లాలో పెద్దగా వివాదాల్లో కూరుకోక పోయినా, ఎన్నికల సమయంలో మాత్రం మాగుంట వర్గానికి వత్తాసు పలికాడన్న అపకీర్తి భూజానవేసుకున్నాడు. పూర్వపు ఎస్.పి కృష్ణ ప్రసాద్ అంత చురుకుగా పని చేయక పోయినా టౌన్‌లో ట్రాఫిక్ సిగ్నల్స్, డివైడర్స్ ఏర్పాటుకు కృషి చేశారు. ముఖ్యంగా పోలీస్ సిబ్బంది సంక్షేమానికి అనేక చర్యలు గైకొన్నారు. 6 తేది కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన వీడ్కోలు సభలో ఈ మంచి చెడులు రెండూ ప్రస్తావనకు వచ్చాయి. వినియోగదారుల ఫోరం ఛైర్మెన్ కె. సిద్ధారెడ్డి ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించి మాట్లాడారు. స్వతహాగా పోలీసులకు, న్యాయవాదులకు స్నేహ భావం తక్కువ, కాని పలు క్రిమినల్ కేసుల పరిష్కారంలో రమణమూర్తి చొరవ చూపడం వల్లే లోక్ అదాలత్‌లో సుప్రీం కోర్టు న్యాయమూర్తి చేత ప్రశంసలు పొందారు. అసెంబ్లీ ఎన్నికల సమయంలో ఏర్పాటు చేసిన బందోబస్తుకు ఎస్పి కేంద్ర ప్రభుత్వ అవార్డు పొందడం వృత్తి పట్ల ఆయన చూపిన అంకిత భావాన్ని వెల్లడి చేస్తుందన్నారు. టౌన్ డిఎస్పి లక్ష్మీరెడ్డి మాట్లాడుతూ ఏ జిల్లాలో లేని విధంగా పోలీస్ కుటుంబాల కోసం ఆస్పత్రి, నిత్యావసర వస్తువుల స్టోర్‌ను ఏర్పాటు చేయించడం తోపాటు, కానిస్టేబుల్ కుమారుని వున్నత విద్యాభ్యాసానికి సహాయ పడినట్లు

కొరవ 10 పేజీలో

## సణుగుడు

### * జమీన్‌రైతును తిడితే మీ తప్పులు మరుగున పడతాయా?

### * విఆర్ కాలేజిని రక్షించండి!

జిల్లాలోని కాంగ్రెస్ పెద్దలకి మధ్య పత్రికలను ఆడిపోసు కోవడం పెద్ద ఫ్యాషనై పోయింది. జమీన్‌రైతును తిట్టడమంటే వారికి మరీ సరదా! సందు దొరికితే చాలు - నోటి దురద తీర్చుకుంటున్నారు.

మొన్న మాగుంట సుబ్బరామ రెడ్డిగారు నిర్వహించిన తమ వర్గీయుల సభలో జమీన్‌రైతు పత్రికే పెద్ద సబ్జెక్ట్. మైకు పట్టుకొన్న ప్రతి వాడూ, ప్రతి నాయకుడూ తిట్టు కవిత్వం వల్లించారు. జిల్లాలో, మరీ ముఖ్యంగా నెల్లూరు టౌన్‌లో కాంగ్రెస్ ఓడిపోవడానికి జమీన్‌రైతు వార్తలే కారణమట. జిల్లాలోని నాయకుల మధ్య చీలికలు, కలతలు, కీచులాటలకూ జమీన్‌రైతు పత్రికదే బాధ్యత అట. ఇంకా నయం - తమ ఇళ్లలో ఆడవాళ్ల అలుకలకు, వారు వండే కూరల్లో ఉప్పు మర్చి పోవడానికి కూడా జమీన్‌రైతే పూచీ అని చెప్పలేదు. జమీన్‌రైతు నోరు కతక్కున మూసి పారేయనిదే; పీక గట్టిగా పిసికి పారేయనిదే జిల్లాలో కాంగ్రెస్ బ్రతకదని నాయకమ్మన్యులంతా ఏకగ్రీవంగా రహస్య తీర్మానం చేసి నట్లున్నారు.

ఆనం వర్గం నాయకుడు శ్రీ సంజీవ రెడ్డిగారు కూడా మాపై నిప్పులు చెరిగారు. డిసిసి అధ్యక్ష పదవిలో తన కొనసాగింపును ప్రశ్నించినందుకు నేరుగా మమ్మల్నే నిలదీశారాయన. ఈ పదవి కోసం నేనేమైనా ప్రాకులాడు తున్నానా అని కోప్పడ్డారు.

మరొక వర్గం ముఖ్యుడు "జమీన్‌రైతు న్యూసెన్స్ లేకుంటే మేం సుఖంగా రాజీ యత్నాలు చేసుకొంటాం" అన్నారట.

ఇంతింత పెద్ద నాయకులను అంతంత కష్ట పెట్టే స్థోమత వుందా ఈ చిన్న పత్రికకు? ఎందుకు వీరికి ఇంత కంపరం?

జిల్లాలోని నాయకు లందరి కంటే, కాంగ్రెస్ పట్ల చిత్తశుద్ధితో కూడిన, అంకిత భావం కల్గిన పత్రిక జమీన్‌రైతు. అరవై ఆరేళ్ల సుదీర్ఘ కాలంలో ఒక్క పూట కూడా కాంగ్రెస్ అనురక్తి వీడని ఉజ్వల చరిత్ర కల్గిన పత్రిక ఇది.

కాంగ్రెస్ అభిమానం వున్నంత మాత్రాన, కాంగ్రెస్ నాయకులకు బాకా వూద వలసిన, వారి తప్పులను కప్పిపెట్ట వలసిన అగత్యం మాకు లేదు. సామాన్యుల నుంచి, నగటు కార్యకర్త నుంచి పార్టీని దూరం చేసి, ధనస్వాముల లోగిళ్లలో వూడిగానికి తరలించే ప్రయత్నాన్ని నిరోధించడం మేము చేసిన అపరాధమైతే ఈ శాపనార్థాలకు అర్హులమే; తెలుగు పిల్లి కాచుకొని వుంది. మీలో మీరు తన్నుక చచ్చి అధికారాన్ని దాని నోటికి అప్పగించ వద్దని గొంతు చించుకొని అరిచి చెప్పడమే మేము చేసిన తప్పు అనుకుంటే ఈ తిట్లు మాకు తగలాల్సిందే; ఎవరి నియోజక వర్గాలలో వారు గెలవడానికి శక్తి యుక్తులు ప్రదర్శించాల్సింది పోయి, ప్రక్క నియోజక వర్గంలో పోటీలో వున్నవాడ్ని ఓడించడానికి కోట్లు క్రుమ్మరించడం నీచమని వేలెత్తి చూపడం మేము చేసిన నేరమైతే -

కొరవ 7 పేజీలో

డోలేంద్ర

# లక్ష ఏళ్ల క్రితమే నెల్లూరులో మనుషులుండినారు!

## నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!

కొల్లూరి సాయిభక్త కేశవ

సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్ర రచనకు లభించే ఆధారాలు చాలా తక్కువ. వెయ్యి లేదా రెండువేల సంవత్సరాల క్రితం నెల్లూరులో మానవ నాగరికతా వికాసమెలా జరిగింది అనేది తెలుసుకోవాలనే ఆతృత, అభిలాష నెల్లూరీయులందరిలోనూ ఉన్నది. అయితే ఆ కాలపు వొశేషాలతో కూడిన గ్రంథాలుకాని, శాసనాలు కాని లభించలేదు. అందువల్ల ఈ ప్రాంత చరిత్ర పునర్నిర్మాణానికి చాలా అవరోధాలు ఏర్పడుతున్నాయి. చాలా మంది సామాన్యులలోనూ, విద్యావంతులలోనూ సింధూ నాగరికత పరిఢవిల్లిన కాలంలో(క్రీ.పూ. 2500 సంవత్సరాల నుండి క్రీ.పూ. 1500 సంవత్సరాల వరకు) నెల్లూరు ప్రాంతం ఏ పరిస్థితిలో వున్నది? అక్కడ జన జీవనం ఉన్నదా? లేదా? స్థిర నివాస మేర్పరచుకున్న ప్రజలున్నారా? లేక సంచారవాసులేనా? అన్న అనుమానాలు తలెత్తుతాయి. ఆంధ్రదేశంలో చాలా జిల్లాలలో శాతవాహనుల కాలం నాటి కోట గోడల అవశేషాలు బయల్పడ్డాయి. అయితే నెల్లూరు జిల్లాలో ఆకాలం నాటి అవశేషాలు ఏమైనా ఉన్నాయా? ఉంటే ఆ నాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులు ఎలా వున్నాయి? అనే సందేహాలు తలెత్తుతాయి. వాటిని నివృత్తి చేయాలంటే తప్పని సరిగా పురాతత్వ పరిశోధనలపైన ఆధారపడవలసి వుంటుంది. గత ఐదు దశాబ్దాలుగా ఎంతో మంది పురాతత్వ శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, ఔత్సాహిక చారిత్రక పరిశోధకులు చేసిన పలు విధాలైన పరిశోధనల ద్వారా కొన్ని విషయాలు వెలుగులోకి వచ్చాయి. వీటి వల్ల నెల్లూరు జిల్లాలో మానవ నివాసం రాతి యుగం నుండి అంటే దాదాపు లక్ష సంవత్సరాల నుండి నేటి వరకు నిరంతరం సాగుతూనే వుందని తెలుస్తుంది. సింధూ నాగరికత కాలం నాటి అవశేషాలు లభింపక పోయినా క్రీ.పూ. 2000 సంవత్సరాల కాలంనాటి నూతన శిలాయుగపు రాతి గొడ్డళ్లు దువ్వూరు, నల్లగొండ గ్రామాలలో బయల్పడ్డాయి. 'బృహత్‌శిలా యుగము' (సుమారు క్రీ.పూ. 1000సంవత్సరాల నుండి క్రీ.శ. 400 సంవత్సరాల వరకు )నకు చెందిన మానవుడు నెల్లూరు జిల్లాలో పలు ప్రాంతాలలో స్థిర నివాస మేర్పరుచుకుని నిర్దిష్టమైన పద్ధతులలో వ్యవసాయం చేయడం మొదలు పెట్టాడు. ఈ విధంగా జిల్లాలో మొదలైన మానవ ప్రస్థానం చారిత్రక యుగాలలో నాగరికతా వికాసానికి ఏవిధంగా దోహదం చేసిందో పురావస్తు పరిశోధనల ఆధారంగా ఈ వ్యాసాలలో వివరించాలనే చిరు ప్రయత్నం చేస్తున్నాను.

నెల్లూరు ప్రాంతంలో రాజకీయ చరిత్ర అనేది క్రీస్తు శకారంభ సంవత్సరాలలో ప్రారంభమై, క్రీ.శ. 12 శతాబ్దంలో తెలుగు చోళుల రాకతో నెల్లూరు ముఖ్య కేంద్రంగా వెలుగులోకి వచ్చింది. ఈ మధ్య కాలంలో జరిగిన సంఘటనలు, లభ్యమైన పురావస్తు అవశేషాల మూలంగా ప్రాచీన చారిత్రక వివరాల గురించి చర్చించడం జరిగింది.

ప్రాంతీయ చరిత్రను తయారు చేయడమంటే దేశ చరిత్రను తయారు చేయడం వంటిదే. గ్రామగ్రామం తిరిగి, చారిత్రక అవశేషాలు సేకరించి, వాటి నివేదికలు తయారు చేయడం ద్వారా ప్రాంతీయ చరిత్ర తయారవు తున్నది. అలా తయారు చేయబడిన ప్రాంతీయ చరిత్రలే దేశ చరిత్ర నిర్మాణానికి దోహదం చేస్తున్నాయి. 1974లో పురావస్తు మరియు ప్రదర్శన శాలల శాఖ ప్రాంతీయ కార్యాలయం నెల్లూరులో ఏర్పాటు చేసిన నాటి నుండి అనేక ప్రదేశాలలో పురావస్తు అన్వేషణలు జరిపి అతి విలువైన ప్రాచీన అవశేషాలు సేకరించి వ్యాఖ్యానించడం జరిగింది. ఆ పరిశోధనల సారాంశమే ఈ చరిత్ర నిర్మాణానికి ముఖ్య ఆధారం.

దాదాపు లక్ష సంవత్సరాల పైగా ఉన్న మానవ చరిత్రను సులభంగా అధ్యయనం చేయడానికి

కొరవ 8 పేజీలో

# కోట్లు చేసే గాజు ఫ్యాక్టరీని లక్షల్లో చౌకగా అమ్మేస్తారా?

గూడూరులో కోట్ల రూపాయల విలువ చేసే ప్రభుత్వ గ్లాస్ ఫ్యాక్టరీని బడా పారిశ్రామిక వేత్తలు, అధికారులతో కుమ్మక్కై, లక్షల రూపాయలతో చేజిక్కించు కొనేందుకు పథకం సిద్ధం చేసుకొన్నట్లు తెలుస్తూంది. 50 సంవత్సరాల క్రితం కట్టబడిన ఈ గ్లాస్ ఫ్యాక్టరీ గత కొన్ని సంవత్సరాలుగా మూత బడి వుంది. దీర్ఘ కాలికంగా మూత వేయడం కన్నా అమ్మేయడమే వుత్తమమని భావించి ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది. అప్పటి నుంచి కారు చౌకగా ఈ ఫ్యాక్టరీని పొందేందుకు గూడూరు ఘరానా పెద్దలు సంసిద్ధ మయ్యారు. అంకణం స్థలం 5 వేల రూపాయల మేర విలువ చేసే ఫ్యాక్టరీ స్థలాన్ని 700 రూపాయల చొప్పున కొనేందుకు అధికారుల సహాయంతో ఉత్తర్వులు జారీ చేయించినట్లు వినికిడి. గత ప్రభుత్వం హయాంలో హైదరాబాదులో జరిపిన వేలం పాటలో పారిశ్రామిక వేత్తలంతా మాట్లాడుకొని తక్కువ పాటకు సిద్ధమయ్యారట. ఫ్యాక్టరీలోని వస్తువులు, స్థలం వేలం వేస్తేనే దరిదాపులు రెండున్నర కోట్లు ప్రభుత్వానికి న్యాయంగా రావాలి. కాని అధికారుల హస్త లాఘవం వల్ల ఫ్యాక్టరీలోని భారీ మిషన్లు, వేల టన్నుల ఇనుప తుక్కు, పెద్దలు, భవనాలు, స్థలం మొత్తం 30 లక్షల మేర మాత్రమే పాట పాడినట్లు తెలిసింది. వాస్తవంగా ఫ్యాక్టరీలోని సిమెంటు రేకులు, పాత ఇనుము పనికి రాని వస్తువులు అమ్ముకొంటేనే 30 లక్షలకు పైగా వస్తుందని పలువురు అభిప్రాయ పడుతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం వాస్తవ పరిస్థితులు తెలుసుకొని స్థలాన్ని, వస్తువులను వేరు వేరుగా వేలం వేస్తే ప్రభుత్వానికి కోట్లాది రూపాయలు వస్తాయి. గతంలో ఈ ఫ్యాక్టరీలో పని చేస్తుండిన కార్మికులు స్థానిక శాసన సభ్యుడు బల్లి దుర్గాప్రసాద్‌ను కలసి ఫ్యాక్టరీ తిరిగి పని చేయించేలా చర్యలు తీసుకోవాలని కోరారు. ప్రభుత్వానికి ఫ్యాక్టరీ నడిపే సత్తా ఎటు లేదు. కనీసం కోట్లాది రూపాయలు చేసే సంపదను లక్షల రూపాయలకు అమ్మాలని ప్రయత్నిస్తున్న అధికారుల ప్రయత్నాలనైనా వమ్ము చేసేందుకు టెండర్ల తంతును రద్దు చేయవలసి వుంది.

## గూడూరు ఘరానా దోపిడీ ఆపండి!

## విశ్వోదయ నరసింహారావు వర్ధంతి!

వెంకటగిరి విశ్వోదయ ప్రభుత్వ కళాశాల వ్యవస్థాపకులు జె.వి. నరసింహా రావు వర్ధంతి సభ ఇటీవల కళాశాలలో జరిగింది. ప్రిన్సిపల్ ఎం.ఆది నారాయణ శర్మ అధ్యక్షత వహించి మాట్లాడారు. కళాశాల స్థాపనకు నరసింహా రావు ఎన్నో కష్ట నష్టాలు భరించారు. 1968 లో 14 మంది అధ్యాపకులు 400 మంది విద్యార్థులతో ప్రారంభ మైన కళాశాల నేడు 83 మంది సిబ్బంది 1400 మంది విద్యార్థులతో విరాజిల్లు తుందన్నారు. రాష్ట్రం లోనే అత్యుత్తమ ఫలితాలు సాధిస్తున్న సంస్థ పురోభి వృద్ధికి ప్రజలంతా సహకరించాలని కోరారు. పి. సత్యనారాయణ శెట్టి, జి. సీతా రమణయ్య, డాక్టర్ బి. సూర్య నారాయణ, డాక్టర్ కె.ఎం. సిద్ధిక్ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. డాక్టర్ ఎం. సుబ్బా రెడ్డి స్వాగతం పలుకగా డాక్టర్ వి.వి. రమణా రెడ్డి చివరన వందన సమర్పణ చేశారు.



గూడూరు గాజుఫ్యాక్టరీ భవన సముదాయము

# ఫారెస్ట్ స్మగ్లింగ్ - ప్రాక్టికల్ జోక్!

సినిమాల్లో చివరి సన్నివేశంలో కథ సుఖాంత మయ్యాక దడబడలు సృష్టించే సినిమా పోలీసుల తరహాలో స్మగ్లర్లు తమ పనంతా చక్కదిద్దు కొని పోయాక అనవసర హడావుడి చేసి అల్లరి పాలవుతున్నారు రాపూరు అటవీ సిబ్బంది. రాపూరు, కడప సరిహద్దుల్లో నిరంతరం ఎర్ర చందనం స్మగ్లింగ్ జరిగే విషయం అందరికీ తెల్సిందే. పాపం అటవీ శాఖాధికారులు మాత్రం ఈ విషయం తమకు తెలిసినా తెలియనట్లు నటిస్తుంటారు. మొన్న 7 తేదీ స్మగ్లర్లు తమకు కావలసిన ఫస్ట్ క్వాలిటీ ఎర్ర చందనాన్ని లారీలలో ఎక్కించుకొని పనికి రాని తెల్ల ఛాయ దుంగలను రోడ్డు పక్కనే పారేసి వెళ్లారు. ఎర్ర చందనం నిఘా విభాగపు అధికారులు పనికి మాలిన దుంగలను రాపూరుకు తరలించి, రవాణాకు సిద్ధంగా వున్న వాటిని పట్టుకొని ఘన కార్యం చేసినట్లు పత్రికల వారికి చెప్పారు. మూడు, నాలుగు రోజులుగా రోడ్డు ప్రక్కనే పడి వున్న వాటిని అధికారులు స్వాధీనం చేసుకొని దాడి చేసి పట్టుకొన్నట్లు చెప్పుకోవడాన్ని ప్రజలు ప్రాక్టికల్ జోక్ క్రింద జమ వేశారు. వాస్తవంగా రవాణా అయ్యే

కారం 12 పేజీలో

## జిల్లావార్తలు

# ఉత్తరక్రియలు



మా అభివృద్ధి కారకురాలు

## శ్రీమతి రేబాల కౌసల్యమ్మ గారు

విడవలూరు

7.1.1995 తేది శనివారం స్వర్గస్థులైనారు

వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ, వారి ఉత్తరక్రియలు

విడవలూరులో మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

**కర్మక్రతువులు 19.1.95 గురువారం ఉదయం**

రేబాల బలరామరెడ్డి - భర్త

కుమారులు - కోడళ్ళు:
సుందరరాజా రెడ్డి - ప్రేమలత, హరనాధరెడ్డి - ఇందిర
వసంతకుమార్‌రెడ్డి - సరళ, బాబురెడ్డి - సుభాషిణి
రామిరెడ్డి - మంజుల

కుమార్తె - అల్లుడు:
పొన్నపోలు సుధాలక్ష్మి - చంద్రశేఖరరెడ్డి

మనమలు: రేబాల శ్రీధర్‌రెడ్డి - మమత
రేబాల రమణారెడ్డి - సవిత
రేబాల జీవన్‌రెడ్డి - గీత

మనుమరాళ్ళు: కోటంరెడ్డి అనిత - శ్రీధర్‌రెడ్డి
కోడూరు శీల - గోపినాథ్‌రెడ్డి
కొండా అచ్యుత - శ్రీధర్‌రెడ్డి
శ్రీకళ, దివ్య, కావ్య, నిఖిల, చరిత, నిషిత

మునిమనుమడు - మనుమరాళ్లు : అశ్విత్, శ్రీ జ్యోత్స్న, వర్షిణి

## నెల్లూరు [illegible]
### విమర్శకుడు

### రిజర్వేషన్లు నెలాఖరులో!

మునిసిపాలిటీలు, పంచాయితీ (...)కు సంబంధించి రిజర్వేషన్ల నిర్ణయం (నె)లాఖరుకు వాయిదా పడింది. (ఎ)న్నికలను ఫిబ్రవరిలో కాక, మార్చికి (వా)ర్పుదంతో రిజర్వేషన్లపై ఒక (ని)ర్ణయం తీసుకోవడానికి సావకాశం (చి)క్కింది. ఈలోగా జిల్లా పరిషత్ (హ)రిజనులకు రిజర్వు, అయిందని, (మ)ునిసిపాలిటీని మరొకరికి (కే)టాయించారని వస్తున్న వార్తలన్నీ (ని)రాధారాలే. రాష్ట్ర ప్రభుత్వమే ఇప్పటికీ (వి)షయంలో ఒక అవగాహనకు (రా)లేకున్నది. రాష్ట్రాన్నంతటినీ ఒక యూనిట్‌గా తీసుకోవాలా లేక ఏ జిల్లాకా జిల్లాను విడివిడిగా చూడాలా అన్నది తేలలేదు. బిసిల జనాభాకు సంబంధించిన వివరాలలోని అస్పష్టత వల్ల కొంత గందరగోళం ఏర్పడుతున్నది. న్యాయ పరమైన చిక్కులేర్పడకుండా ఈ సమస్యను పరిష్కరించాలంటే చాలా పెద్ద పనే!

### చక్కెర రాజీనామా

చక్కెర ఫ్యాక్టరీ ఛైర్మన్ శ్రీ సామంతు సుబ్బారెడ్డి తన పదవికి రాజీనామా చేశారు. కాంగ్రెస్ ప్రభుత్వ నియామకం కాబట్టి, తెలుగు దేశం చేత చెప్పించుకోకుండా తనంతట తానుగా పదవి వదులుకున్నారు.

సుబ్బారెడ్డిగారి నిష్క్రమణ చెరకు రైతాంగానికి పెద్ద లోటు. ఫ్యాక్టరీని నమ్ముకొని చెరకు వేసి నష్టాల పాలై అష్టకష్టాలు పడుతుండిన రైతులను ఆరేళ్ల కృషితో గట్టెక్కించారాయన. సుబ్బారెడ్డి ఛైర్మన్ అయ్యేనాటికి కోవూరు చక్కెర ఫ్యాక్టరీ అప్పుల ఊబిలో కూరుక పోయి వుండింది. ఏ ఏడాది కూడా సక్రమంగా చెరకు ఆడలేదు. ఆడిన చెరకుకూ రికవరీ తక్కువ. ఆయన రాత్రింబవళ్లు పనిచేసి, రైతుల సహకారం తీసుకొని పదికోట్ల రూపాయలుగా వుండిన అప్పుబాధ నుంచి ఫ్యాక్టరీని తప్పించారు. అది పోను ఇప్పుడు 3కోట్ల 48 లక్షల మిగులు ధనం ఏర్పడిందంటే వారి కృషి ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. ఇంకొక ప్రక్క ఫ్యాక్టరీ సామర్థ్యాన్ని 1250 టన్నుల నుంచి 2వేల టన్నులకు పెంచారు. తెగుళ్ల నివారణకు బయో ఏజంట్స్ ల్యాబ్ నెలకొల్పారు. రైతులకు 4 కోట్ల 38 లక్షలు అప్పులుగా ఇచ్చారు. ఫ్యాక్టరీ సామర్థ్యాన్ని 2500 టన్నులకు పెంచే ఏర్పాట్లు చేశారు. ఇందుకోసం 14 కోట్ల అప్పు లభించ బోతున్నది. రికవరీని 9.8 శాతానికి పెంచి ఒకటికి రెండు సార్లు జాతీయ స్థాయి అవార్డులు పొందారు.

సహకార రంగంలోని చక్కెర ఫ్యాక్టరీని ఇంత సమగ్రంగా తీర్చిదిద్ది, సమర్థవంతంగా నిర్వహించిన ఛైర్మన్లు దేశంలోనే అరుదుగా వుంటారు. ఈ ఆరేళ్లలో ఒక్క వివాదం, ఒక్క అవినీతి ఆరోపణ ఎదుర్కోక పోవడం సుబ్బారెడ్డి గారి విశిష్టత. ఆయనకు మా వీడ్కోలు అభినందనలు.







### సెలవుపై వెళ్లిన మునిసిపల్ కమీషనర్

నెల్లూరు మునిసిపల్ కమీషనర్ కెప్టెన్ డివిరెడ్డి సెలవుపై వెళ్లారు. ఇంజనీరు శ్రీ రామసుబ్బారెడ్డి ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తారు.

కమీషనర్ సెలవుకు కారణం అనారోగ్యమేనా? మరేదైనా ఒత్తిడి వుందా?

### పోలీసు బదలీలు- కీలక మార్పిడులు!

కొత్త ఎస్పి శ్రీ పూర్ణచంద్రరావు జిల్లాలో ఆరుగురు ఎస్ఐలను బదలీ చేశారు. టౌన్‌కు సంబంధించినవి కొన్ని వున్నాయి ఇందులో!

నెల్లూరు టౌన్ ఎస్ఐలు చాలా కాలం నుంచి ఇక్కడ్నే పాతుకపోయి వుంటున్నారు. కుంత మార్పిడులు వలె వన్‌టౌన్‌నుంచి టూ టౌన్, టూటౌన్ నుంచి వన్‌టౌన్‌కు కాకుండా, ఒక్కసారి టౌన్‌లోని పోలీసు సిబ్బందినంతటినీ, కానిస్టేబిళ్లతో సహా ప్రక్షాళన చేయడం అవసరం.

### ఖైదీల మృతిపై దర్యాప్తు

జిల్లా జైలులో సెప్టెంబరు నుంచి డిసెంబర్ వరకు రిమాండ్ లోని అయిదు గురు ఖైదీలు మరణించిన సంఘటనపై మెజిస్టీరియల్ విచారణ జరుగుతుంది. ఈనెల 16తేది రెవిన్యూ డివిజన్ కార్యాలయంలో ఆర్డీవో బి. జనార్దనరెడ్డి కలెక్టర్ వుత్తర్వుల మేరకు విచారణ చేయనున్నారు. మృతుల బంధువులు గాని, సంఘటనల గురించి తెలిసిన వారు గాని నిర్భయంగా వచ్చి సాక్ష్యం చెప్ప వచ్చంటున్నారు ఆర్డీవో.

### బిడిఎస్‌లో యూనివర్శిటీ ఫస్ట్

నెల్లూరు మూలపేటకు చెందిన సింగరాజు గౌరీ శంకర్ అనే విద్యార్థి దంతవైద్య పరీక్ష (బిడిఎస్) లో ఆంధ్రప్రదేశ్ మెడికల్ విశ్వవిద్యాలయానికంతటికీ ప్రథముడిగా ఉత్తీర్ణుడైనారు. గౌరీశంకర్, హైదరాబాదు డెంటల్ కాలేజీలో చదువుతుండినాడు. ఓరల్ మెడిసిన్, ఓరల్ సర్జరీలో బంగారు పతకాలు కూడా సాధించారు. ఢిల్లీలోని డెంటల్ ప్లాక్ అవార్డుకు అర్హత పొందాడు.

సోమశిల కార్యాలయంలో డిఇఇగా పనిచేస్తున్న శ్రీ ఎస్. కామేశ్వరరావు కుమారుడు గౌరీశంకర్. ఇటువంటి ప్రతిభావంతుడ్ని కన్న ఆ తండ్రి ఎంత అదృష్ట వంతుడో!

### కపాడిపాళెంలో నేత్రదానం!

ఎస్.సి. కార్పొరేషన్‌లో కారు డ్రైవర్‌గా పనిచేసే చిన్నయ్య భార్య మరియమ్మ 38 సంవత్సరాల చిరు ప్రాయంలో 4 తేది కన్నుమూసింది. నేత్ర దాతల సంఘం కార్య నిర్వాహక సభ్యుడు వాకాటి రవీంద్ర, చిన్నయ్యను కోరిన మీదట, వెంటనే భార్య నేత్రాలను దానం చేసి తన వుదార హృదయం చాటారు. టౌన్‌లో జరిగిన 20 వ నేత్ర దానం యిది. ఈ నేత్రాలను 5తేది మద్రాసులోని ప్రభుత్వ వైద్యశాలకు నెల్లూరు నేత్ర దాతల సంస్థ తీసుకెళ్లి అప్పగించింది.

### మరణాలు

నెల్లూరు ఇన్‌కంట్యాక్స్ ఇన్స్‌పెక్టరు, నిభార్పయిన కాంగ్రెస్ అభిమాని శ్రీ బి. పిచ్చయ్య 5 తేది హఠాత్తుగా స్వర్గస్తులైనారు. చాలా కాలం నుంచి అనారోగ్యంతో బాధపడుతుండినారు. గుండె పోటు ప్రాణం తీసింది. ఆయన వయస్సు 54 సంవత్సరాలు. భార్య, ఇద్దరు కుమారులున్నారు.

పిచ్చయ్య హరిజన సేవా కార్యక్రమాలలో చాలా చురుకుగా పాల్గొనేవారు. కాంగ్రెస్ అంటే పడి చచ్చే వాడు.

* * *

ఇనమడుగు పెద్దరైతు దువ్వూరు జానకిరామరెడ్డి 9తేది మరణించారు. కోవూరు రాజకీయాలలో ముఖ్యమైన వ్యక్తి జానకిరామరెడ్డి. ఇనమడుగు సర్పంచ్‌గా, జమ్మిపాళెం గ్రామ మునసబుగా వుండినారు. ఇనమడుగులో హైస్కూలు స్థాపించింది ఆయనే. మద్రాసు, వాకాటి వీరారెడ్డి సత్రానికి చాలాకాలం నిర్వాహక మండలి సభ్యుడుగా వుండినాడు. ఆ సత్రం టిటిడి పరం కావడాన్ని సవాల్ చేస్తూ ఆయన హైకోర్టులో వేసిన కేసు ఇంకా పెండింగ్‌లోనే వుంది.

ఆయన వయస్సు 81 సంవత్సరాలు; భార్య ఐదుగురు కుమార్తెలు, ఒక కుమారుడు వున్నారు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి

## సణుగుడు

4వ పేజీ కొరవ

మా సీత పిసికితేనే శిక్షకు మేము తల వంచాల్సిందే; నాయకుడు అధికారంలో వున్నన్ని రోజులూ అడుగులకు మడుగు లొత్తి, మరొకరు దగ్గరకు రాకుండా అతడి చుట్టూ చేరి దడి కట్టి, వ్యాపార లాభం చూసుకొని, పదవి పోయిన తర్వాత వ్యక్తిగత కక్షల పేరుతో విరోధించి, పార్టీని చీల్చి ముక్కలు చేసే దౌర్భాగ్యపు తత్వం గర్హనీయమని విలేదీయడమే మాపై నీలాప నిందలకు ఆస్కారం కల్పించి వుంటే మేము చవితి చంద్రుణ్ణి చూసిన వారమే అయి వుండాలి.

జమీన్‌రైతు కాంగ్రెస్‌ను అభిమానిస్తుంది కాని, కాంగ్రెస్ తప్పులను ఒప్పులుగా చూపించాల్సిన బానిసత్వం స్వీకరించదు; కాంగ్రెస్ నాయకులను ప్రోత్సహిస్తుంది కాని వారు చేసే ప్రతి ఛండాలపు పనినీ సమర్థించాల్సిన అవసరం లేదు; వూరకే పత్రికలను తిట్టి పోసినంత మాత్రాన నాయకులు తమ తప్పులు కప్పి పెట్టుకో లేరు. ఎందుకీ వ్యర్థ ప్రేలాపనలు? వృథా ప్రసంగాలు?

* * *

వి.ఆర్. కాలేజీలో ఆడపిల్లలను వేధించే విద్యార్థులు ముగ్గురికి టీసీలు ఇచ్చి పంపించివేశారని. వారిలో ఒకడు మరీ బరితెగించి క్లాసు రూములోనే ఒక అమ్మాయిని ముద్దు పెట్టుకోవడంతో తోటి విద్యార్థులే సహించలేక, పట్టుకొని తన్ని పోలీసుకు అప్పగించారని వార్తలు చదువుతుంటే బాధ కల్గుతూంది. వి.ఆర్. కాలేజీలో ఇటువంటి ఆకతాయి పనులు ఎప్పుడూ లేవు.

యాజమాన్యం ఈ విషయంలో కఠినంగా వ్యవహరించడం అభినందనీయమేకాని, ఆ నిర్ణయం తీసుకోవడంలో చాలా ఆలస్యం చేయడం వల్లనే పరిస్థితి ఇంత దూరం వచ్చిందని చెప్పక తప్పదు. వి.ఆర్. కాలేజీలో ఆడ పిల్లల సంఖ్య చాలా ఎక్కువ. అయినా ఎప్పుడూ ఎటువంటి ఇబ్బందీ ఎరుగరు. ఆ సుహృద్భావ వాతావరణం మాసిపోయి, అల్లరి మూకల ఆగడాలకు నిలయమై పోతే కాలేజీ భ్రష్టు పడుతుంది. ఎంత పలుకుబడి కల్గిన వారి పిల్లలైనా సరే- దుడుకుగా వ్యవహరిస్తే కఠినంగా దండించడంలో తటపటాయిస్తే పరిస్థితి చేయి దాటుతుంది. ఆనం వివేకానందరెడ్డి అల్లరి మూకలను చూసి భయపడే రకం కాదు. తగిన ఆదేశాలిచ్చి, అయ్యవార్లను ధిక్కరించి వ్యవహరించే విద్యార్థులను మెడపట్టి బయటకు నెట్టే స్వేచ్ఛ కల్పించగల్గితే క్రమశిక్షణ నెలకొంటుంది. అది ఎంత త్వరగా జరిగితే అంత మేలు.

## సర్దుబాట్లు

2 పేజీ కొరవ

మినహాయించి మనం లేదా వీరిని మినహాయించి మనం అనే ప్రతిపాదనలు తమకు సమ్మతం కాదని తేల్చి చెప్పేశారు.

ఇంకొక ప్రక్క ఏ వర్గానికా వర్గం పంచాయితీ ఎన్నికల కోసం రెడీ అయిపోతున్నది. ఎవరికి వారు ఈ ఎన్నికలను తమ ప్రత్యర్థులను చావు దెబ్బ తీసేందుకు అవకాశంగా భావిస్తున్నారు తప్ప, తాము గెలవడానికి ఛాన్సులు వెతకడం లేదు. గెలుస్తామనే నమ్మకం ఎవరిలోనూ లేదు కదా? ఆత్మకూరులో డాక్టర్ బి. సుందర రామిరెడ్డి వర్గం, ఆనం సంజీవ రెడ్డిని దెబ్బ తీసేందుకు అవకాశాలున్న చోటల్లా తన మనుషులైన వారిని తెలుగుదేశంలోకి పంపించే ఏర్పాట్లు చేస్తున్నది. గూడూరు, వెంకటగిరి నియోజక వర్గాలలో వేమారెడ్డి రామచంద్రా రెడ్డి అటువంటి ప్రయత్నమే చేస్తున్నారు. సర్వేపల్లిలో జెకె రెడ్డి, సివి శేషారెడ్డిల స్పర్థలను మరొకసారి తెలుగుదేశం చంద్రమోహన రెడ్డి తనకను కూలంగా మల్చుకో బోతున్నారు.

నెల్లూరు టౌన్‌లో ఆనం మాగుంట వర్గాలు ఎవరికి వారుగా కాంగ్రెస్ సభలు నిర్వహిస్తున్నారు. మునిసిపల్ ఎన్నికలకు రెడీ అవుతున్నారు. ఆనం వారికి ఈ ఎన్నికల పట్ల వ్యక్తిగత ఆసక్తి వుంది; మునిసిపల్ రాజకీయాలు వారికి ఆయువు వంటివి కదా! మాగుంట వారికి కూడా అటువంటి ఆసక్తి వుందా? స్వంతంగా అభ్యర్థిని నిలబెట్టే ప్రయత్నం చేస్తారా? ఏమో, ఇప్పుడే చెప్పలేము.

ఆనం సోదరులు మాత్రం జనార్దన రెడ్డి అనుచరుడైన దేవకుమార రెడ్డిని కలుపుకొని తమ సన్నాహాలు చేస్తున్నట్లుంది.

ఎవరి అవసరాలు, ఆశలు, కోపాలు, తాపాలు వారివిగా వున్నప్పుడు అందరూ కలిసి ఒకటిగా నడవడం అంత సులభ సాధ్య మవ్వించడం లేదు. ఎవ్వరిలోనూ కక్షలు చల్లార కుండా చేతులు కల్పి ఒక వేదిక ఎక్కినంత మాత్రాన వుపయోగం ఏముంది? దీనికి బదులు ఎవరికి వారు ఎన్నికల సర్దుబాట్లు చేసుకొని ఎవరి పరిధిలో వారు, ఎవరి ప్రాంతంలో వారు తమ శక్తి మేరా కాంగ్రెస్‌ను బలోపేతం చేయడానికి ప్రయత్నిస్తే ఫలితం వుంటుంది. 1989 ఎన్నికల్లో జరిగింది అదే కదా? ఏ అభ్యర్థి, లేదా నాయకుడు తన నియోజక వర్గం వదలి ప్రక్కకు పోలేదానాడు; ఎవరి శక్తితో వారు గెలవడానికే ప్రయత్నించారు; తమ శక్తిని, వనరులను ఇంకొకరి ఓటమికి వుపయోగ పెట్టలేదు. దానితో 11 స్థానాలలో తెలుగుదేశం ఓటమి పాలైంది, కాంగ్రెస్ గెల్చింది. మనసులో విషం దాచుకొని, కక్షలు అదిమి పెట్టుకొని పైకి రాజీ పడినట్లు నటించి జనం కళ్ల నీళ్లు తుడిచే కంటే - ఎవరికి వారుగా విద్రోహాలు మాని, పని చేసుకొంటూ పోతే కాంగ్రెస్‌కు అధిక లాభం చేకూరుతుంది. కక్షలు పూర్తిగా మర్చిపోయి, అందరూ అందరితో కలసిపోతే మాత్రం కాంగ్రెస్ కార్యకర్త అన్న ప్రతివాడూ ఆనందపడతాడు.

## న్యాయస్థానాలు

2 పేజీ కొరవ

సంతృప్తికరంగా లేరు. వారిలో చాలా అలజడివుంది. వీటివల్ల రోజు రోజుకీ ఫోరం ప్రతిష్ట పలచబడు తున్నది. సిద్దారెడ్డి గారు ఛైర్మన్‌గా వచ్చినప్పటి నుంచే ఈ పరిస్థితి. అంతకు క్రితమెప్పుడూ ఫోరం వివాదాస్పదం కాలేదు. న్యాయవాదులు తొందరపాటుగా ప్రవర్తించలేదు. నెల్లూరు న్యాయవాదులు న్యాయమూర్తుల పట్ల దుడుకుగా వ్యవహరించిన ఉదంతం గత వందేళ్ల చరిత్రలో ఎప్పుడూ వినలేదు. ఇప్పుడీ దురదృష్టకర సంఘటన జరిగింది. ఫోరం సభ్యులు, ఛైర్మన్ ఈ వాస్తవం గ్రహించి, తప్పులు తమలో వుంటే సరుకోవడం మంచిది.

## కాంగ్రెస్

మొదటి పేజీ కొరవ

కాబట్టి, ఎన్నిక జరిపిస్తే ఎవరి సత్తా ఎంతో తేల్చుకుంటామని పట్టు బట్టారు. కమాలుద్దీన్ ఈ రభస భరించలేక నిర్ణయం ప్రధాని పి.వి.కి వదిలేస్తున్నట్లు ప్రకటించి లేచి వెళ్లి పోయారు.

దారుణమైన ఓటమికి గురై అవమానాల పాలైన తర్వాత కూడా కోట్ల, వైఎస్‌లు ఇద్దరూ తమ ముఠా తత్వం వీడలేక పోవడం కాంగ్రెస్ వాదులందరినీ బాధ పెడుతున్నది. కేవలం 26 సభ్యుల బలంతో, 250 దాటిన తెలుగుదేశం, దాని మిత్ర పక్షాల ధాటిని ఎట్లా ఎదుర్కోవాలో అర్థం కాని బలహీన స్థితిలో వున్న కాంగ్రెస్ శాసన సభా పక్షం అనైక్యతతో చీలిపోయి, చులకన కావడం చాలా విచారకరమైన విషయం.

సిఎల్‌పి నాయకుడిగా చివరకు శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డినే ప్రధాని శ్రీ పివి నియమించ బోతారని చెప్తున్నారు.

## చంద్రబాబు

మొదటి పేజీ కొరవ

ప్రక్కన పెట్టేశారు. ఆ సంగతి ఇప్పుడామె స్పష్టంగా లోకానికి చాటినట్లయింది. అత్త గారిని ప్రాధేయ పడి పదవి తెచ్చుకున్నాడన్న ఎగతాళి మొదలు కావడం ఆయన్ను, ఆయన అనుచరులను బాధ పెడుతున్నది. ఇద్దరు మగవాళ్లు చేసే పని ఆయనొక్కడికి ఇచ్చాము చాలదా అన్న వ్యాఖ్య మరీ అవమాన కరమైనది. కాని ఎన్‌టి రామారావు గారు మాత్రం ఇదంతా సగించినట్లు చూస్తున్నారు తప్ప అల్లుడి పరువు కాపాడడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. దీని అర్థం లక్ష్మీపార్వతికి అల్లుళ్లిద్దరు కూడా అణగి మణగి పడి వుండ వలసిందేనని పరోక్షంగా చెప్పడమే కదా అని ప్రశ్నిస్తున్నారు రాజకీయ పండితులు. పాపం, చంద్రబాబు!

## పంచాంగం

14తేది శనివారం భోగి పండుగ

15తేది ఆదివారం సంక్రాంతి. ఉత్తరాయణ పుణ్యకాలం మకర సంక్రాంతి. ( సూర్య సంక్రమణం 14 తేది రాత్రి 8.30 గంటలకు జరిగినందున 15 తేది మధ్యాహ్నం 12.30వరకు పితృకర్మలు జరుపు కొనవచ్చును.

16 సోమవారం కనుమ పండుగ.

### ముహూర్తములు

19తేది గురువారం ఉ.గం. 10.30 కు మీన లగ్నమున వ్యాపారారంభములకు సుముహూర్తము లున్నవి.

### జనవరి తిథులు

పుష్యశుద్ధ

తే 14 శని త్రయోదశి రా.గం10.35వ

తే 15 ఆది చతుర్దశి రా.గం12.20వ

తే 16సోమ పూర్ణిమ రా.గం. 1.45వ

పుష్య బహుళ

తే 17 మంగళ పాడ్యమి రా.గం2.45వ

తే 18 బుధ విదియ రా.గం. 3.15వ

తే 19 గురు తదియ రా.గం. 2.49వ

తే 20 శుక్ర చతుర్థి రా.గం. 2.10వ

స్వయంపాకుల శ్రీనివాసులు యం.ఎ.

## రవీంద్ర రె[డ్డి] రోదసీ చౌర్య[ం] వూహాగానమే.

హైద్రాబాదుకు చెందిన ప్రసి. పారిశ్రామిక వేత్త, ఎంటిఎఆర్ యజమాని శ్రీ పర్వతరెడ్డి రవీంద్ర రెడ్డి, తిరువనంతపురం రోదసి రహస్యాల కేసులో భాగస్వామి అయినట్లు పత్రికలలో వచ్చిన వార్తలు నిరాధారాలని తేలింది. దేశమంతటా సంచలనం రేపిన ఈ కేసులో రవీంద్ర రెడ్డికి ప్రమేయం వుందని కేరళకు చెందిన మాతృభూమి పత్రిక వార్త ప్రచురించడం, దానిపై బిజెపి అధ్యక్షుడు శ్రీ ఎల్కె అద్వాని ఒక ప్రకటన చేయడంతో రవీంద్ర రెడ్డి పేరు పత్రికల్లో ప్రముఖంగా ప్రస్తావనకు వచ్చింది. జమీన్‌రైతు, డిసెంబర్ 23 తేది సంచికలో ఈ వార్త ప్రచురించాము. దీనిపై రవీంద్రరెడ్డి గారు ఒక వివరణ పంపారు.

" ఈ విదేశీ గూఢచారుల విద్రోహ కుంభకోణంలో నా ప్రమేయం ఏమాత్రం లేదు. ఈ కేసులో నిందితుడైన కేరళ బిజెపి రామన్ శ్రీవాత్సవ ఎవరో నాకు తెలియదు. అతని నుంచి నేను కాగితాలు స్వీకరించాననడం నిరాధారం. రోదసీ పరిశోధన సంస్థకు అవసరమైన అత్యున్నత సాంకేతిక ప్రమాణాలతో కూడిన పరికరాలు తయారు చేసి, సరఫరా చేయడంలో నా నిపుణత దేశవ్యాప్త గుర్తింపు పొందింది. ఈ సరఫరా విషయంలో తప్ప మరే రూపంలోనూ నాకు రోదసీ సంస్థతో ప్రమేయం లేదు. ప్రధాన మంత్రి కుమారుడు శ్రీ పివి. ప్రభాకరావును నేనెప్పుడూ కలవలేదు. ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి నాకు దూరపు బంధువు కూడా కాదు. నా వ్యాపార ఉన్నతిని చూసి ఓర్వలేని వారెవరో కల్పించిన కట్టు కథలు ఇవి" అంటున్నారు రవీంద్ర రెడ్డిగారు.

మేము తొలి వార్త వ్రాసే సమయంలోనే రవీంద్రరెడ్డి వంటి ఉన్నత స్థాయి వ్యక్తి దేశ ద్రోహానికి పాల్పడ్డాడనడం నమ్మదగిన వార్త కాదని చెప్పాము. అదే నిజమైంది. తన నిజాయితీని నిరూపించుకొని, గౌరవం నిల బెట్టుకొన్నందుకు ఆయనకు మా అభినందనలు.

ఈ అనవసర వివాదంలో చిక్కుకున్న రవీంద్రరెడ్డి గారి మానసిక స్థితి అర్థం చేసుకోదగిందే. ఆయనకు మా సానుభూతి.

## బద్ధగించవు

నెల్లూరు టవున్ కాపురస్తురాలు తిప్పరాజు నారాయణ రావు గారి భార్య కృష్ణవేణమ్మ యుందు మూలముగా యావన్మందికి తెలియ జేయునది యేమనగా పడుగుపాడు గ్రామం పట్టా నంబరు 1889 రు సర్వే నంబరు 130 విస్తీర్ణం 0.10 ట్లు గల వాగు మిట్ట అను ప్రదేశము నందు నాకు సంపూర్ణ హక్కు భుక్తములు కలిగి యున్నవి. కోర్టు వారు గూడ నా హక్కును స్థిరపరచి యున్నారు. సదరు ఆస్తిని నా అనుమతి లేకుండా చేయు పరాధీనము ఏమిన్ని నన్ను గాని సదరు ఆస్తిని గాని బద్ధగించవు.

టి. కృష్ణవేణమ్మ

16/1926, శ్రీనివాసఅగ్రహారం, నెల్లూరు.

## మదనపల్లె సబ్ జడ్జి కోర్టులో

I.P. 2 of 1994

ఎ. రెడ్డెమ్మ -పిటీషనర్

Vs

పి. రెడ్డిరాజు వగైరా నోటీసు -రెస్పాండెంట్లు

To, R1 చక్కెరరెడ్డి రాజు
S/o. లక్ష్మన్న, రామకృష్ణవీధి
మదనపల్లె

పై కనిన నంబరు I.P దావాలోని 1వ రెస్పాండెంటు అయిన మీకు నోటీసు వాయిదా తెలుపు నిమిత్తం పై కోర్టు వారు 2.2.95 తేది నాటికి వాయిదా వేసి వుంటున్నారు. సదరు వాయిదా రోజున వుదయం 10.30 గంటలకు హాజరయి మీకు ఆక్షేపణలున్న యెడల తెలుపు కొనవచ్చును. కానంతట మీ పరం ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

వాయిదా: 2.2.95

ఎన్.ఎస్.ఎన్. ప్రసాద్
పిటీషనరు పరం న్యాయవాది
కోఆపరేటివ్, కాలని, మదనపల్లె

## కోవూరు సబ్ కోర్టులో

E.P. 32/ 94 : O.S. 83 / 80

State Bank of India represented by its Manager - పిటీషనర్

Vs

M/s. వినాయకా ఫర్టిలైజర్స్
నెల్లూరు,
రెప్రజెంటెడ్ బై its partners
వగైరాలు - రెస్పాండెంట్లు

O21 R22 CPC నోటీసు

To
కొండా శ్రీనివాసులరెడ్డి
S/o. శేషారెడ్డి
కొండావారి పాళెం,

తురిమెర్ల, ప్రస్తుతం బుచ్చిరెడ్డి పాళెం నీ వగైరాల పైన పిటీషనరు పొందిన డిక్రీని అమలు జరుపు నిమిత్తం దాఖలు చేసినందుకు నీకు ఏమైనా ఆక్షేపణలు వున్న ఎడల పై కోర్టుకు ఉదయం 2.2.95 తేదిన 10.30 గంటలకు హాజరై తెలుపు కొనేది లేని ఎడల నీ పరోక్షమున తీర్మానించబడును.

ఉడాలి సుబ్రహ్మణ్యం
5.1.95 పిటీషనర్ వకీలు, కోవూరు

## నెల్లూరుజిల్లా చరిత్ర

4పేజీ కొరవ

చరిత్రకారులు దానిని రెండు భాగాలుగా విభజించారు. అవి 1. చారిత్రక పూర్వయుగము 2. చారిత్రక యుగము. చారిత్రక పూర్వయుగాన్ని తిరిగి 1.రాతి యుగము (దీనిని మరలా పాత రాతియుగము, మధ్యరాతియుగము ఉత్తర రాతి యుగము) అని విభజించారు. 2. సూక్ష్మరాతియుగము, 3. నూతన శిలాయుగము4. తామ్రశిలాయుగము 5. బృహత్ శిలాయుగాలుగా పేర్కొన్నారు. చారిత్రక యుగాన్ని తిరిగి ప్రాచీన చారిత్రక యుగము, మధ్య చారిత్రక యుగము, ఆధునిక చారిత్రక యుగము అని విభజన చేశారు. క్లుప్తంగా లిఖిత పూర్వక ఆధారాలున్న కాలాన్ని చారిత్రక పూర్వయుగమని, లిఖిత ఆధారాలున్న కాలాన్ని చారిత్రక యుగమని వివరించారు. ఈ పద్ధతిలో మనం నెల్లూరు జిల్లా చరిత్రను చదవడానికి ప్రయత్నిద్దాం.

### రాతియుగము

**(ఇప్పటికి దాదాపు 1,50,000 సంవత్సరాల క్రితం)**

ఈ యుగంలో మానవుడు జంతువుతో సమానం. మిగిలిన జంతువుల లాగే తాను కూడా ఒక చోటనుండి మరోచోటకు తిరుగుతూ ఆహార పదార్థాల కోసం వెతుకుతూ ఉండేవాడు. కందమూలాలు త్రవ్వుకోవడానికి, జంతువులను చంపిన పిదప వాటినుండి చర్మం ఊడ బెరకడానికి, మాంసాన్ని ఎముకల నుండి వేరు చేయడానికి, ఎముకలలో ఉన్న మూలుగను తీయడానికి, కొన్ని సందర్భాలలో క్రూర జంతువుల నుండి రక్షణ పొందడానికి ఎముకలు, కొయ్యలతో పనిముట్లు తయారు చేయడానికి ఇలా తనకు కావలసిన అన్ని రకాల పనిముట్లు తయారు చేసుకోవడానికి రాతిని ఎన్నుకున్నాడు. ఆదిమ మానవుడు ఎముక, కొయ్యలతో చేసిన పనిముట్లు వాడినప్పటికీ అవి కాలగర్భంలో కలిసిపోవడం వల్ల వాటి ఆధారాలు మనకు అంతగా లభింప లేదు. రాతితో చేసిన పనిముట్లు అన్ని వాతావరణ వత్తిడులను తట్టుకుని ఉండడం వల్ల అవి నేడు రాతియుగపు మానవుడు సంచరించిన ప్రతిచోటా దొరుకుతున్నాయి. ఈ పనిముట్లు ఎక్కువగా క్వార్ట్జైట్, షేల్, చెర్ట్ అనబడు రాళ్ళతో తయారు చేశాడు.

నెల్లూరు జిల్లాలో రాతి యుగపు మానవుని అవశేషాలు విస్తారంగా లభ్యమైనాయి. పాత రాతి మరియు మధ్యరాతి యుగపు పనిముట్లు దాదాపు 200 గ్రామాలలో కనుగొన్నారు. నెల్లూరు జిల్లాకు పడమటి సరిహద్దుగా ఉన్న వెలిగొండలు, కోస్తాతీరం వెంబడి సమాంతరంగా కనిపించుచున్న లోంతరాతి గుట్టలు, ముఖ్య నదులైన పెన్న, స్వర్ణముఖి, కండ్లేరు మరియు వెంకటగిరి వాగుల పరివాహక ప్రదేశాలు అన్నీ కూడా రాతి యుగపు మానవుని అవశేషాలతో నిండి వున్నాయి.

నెల్లూరు జిల్లాలో రాతి పనిముట్ల సేకరణ క్రీ.శ. 19 శతాబ్దం చివరి నుండి రాబర్ట్ బ్రూస్‌ఫూట్, హెచ్.డబ్ల్యు. సెటాన్ కార్ మొదలగు బ్రిటిష్ వారి పరిశోధనలతో మొదలైనది. 1934 సంవత్సరంలో అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ హాస్పిటల్‌లో వైద్య సేవలందించడానికి వచ్చిన డాక్టర్ ఫ్రాంక్.పి.మాన్లే తమ తీరిక వేళలో పొదలకూరు, రాపూరు, సోమశిల, కుల్లూర్కు, ఉదయగిరి ప్రాంతాలలో అనేక గ్రామాలలో తిరిగి రాతి పనిముట్లు సేకరించారు. 1939 లో ఎఫ్.హెచ్. గ్రేవలీ, అయ్యప్పన్‌లు మాన్లే పైన పేర్కొన్నవారు. గ్రామాలతో పాటు మరికొన్ని గ్రామాలలో రాతి పనిముట్లు సేకరించి ఒక నివేదిక తయారు చేశారు. నెల్లూరు ఎ.బి.ఎమ్. హాస్పిటల్‌లో డాక్టర్‌గా పనిచేయ వచ్చిన, నెల్లూరు జిల్లా ప్రజలకు చిర పరిచితు రాలైన డాక్టర్ మారియానె ఒ.బెర్రీ (డాక్టర్ బేరమ్మ) అనేక గ్రామాలలో రాతి యుగపు పనిముట్లు సేకరించి, తాను అమెరికా వెళ్ళి పోయేముందు పురావస్తు శాఖ వారికి బహూకరించారు.

శ్రీ టి.యస్. ఆర్.మూర్తి నెల్లూరు జిల్లాలో పురావస్తు అన్వేషణలు జరిపి అక్కురాబాదు, ఆకిలివలస, అల్లంపాడు, అంబాపురం, చిలకపాడు, చిరమన, చుట్టి, దాచూరు, డేగపల్లి మొదలగు 49 గ్రామాలలో పాతరాతి మరియు మధ్యరాతి యుగపు పనిముట్లు కనుగొన్నారు.

అంతేగాక వెంకటగిరి వాగు, చెక్కల వాగు, దొడ్లవాగు మొదలగు వాగుల పక్కన ముట్టి కోసుక పోయిన అంచులలో, మధ్య పొరలలో రాతి పనిముట్లు నిక్షిప్తమై ఉన్నట్లు గుర్తించారు. ఈ విధంగా పనిముట్లు దొరకడం వల్ల వాటి కాలాన్ని అంచనా వేయడానికి వీలవుతుంది. డాక్టర్ వి. సుదర్శన్ రాచపాలెం, అగ్రహారం, బ్రహ్మేశ్వరం, కనుపుంపల్లి కమ్మవారిపాలెం, సైదారులపల్లి తదితర గ్రామాలలో పాతరాతి మరియు మధ్యరాతి యుగపు పనిముట్లు కనుగొన్నారు. నెల్లూరు పట్టణంలో పురావస్తు మరియు ప్రదర్శనశాలల శాఖ రిజిష్టరింగ్ అధికారిగా పనిచేసిన శ్రీ జె.సూర్యనారాయణ రాజు సంగం, కొత్తూరు, వెంకటాచల సత్రం తదితర గ్రామాలలో రాతి పనిముట్లు సేకరించారు. ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయానికి చెందిన డాక్టర్ ఎఫ్. జాయినర్ పెద్ద గోపవరం గ్రామంలోని చెక్కవాగు ప్రాంతంలో పరిశోధన గావించారు. హెచ్.ఎన్.సింగ్, డాక్టర్ కె.డి. బెనర్జీలు కూడా మద్రాసు నెల్లూరు రహదారి వెంట అనేక గ్రామాలలో ఈ కాలపు అవశేషాలు కనుగొన్నారు.

ఈ మధ్య కాలంలో పరిశోధకుడనైన నేను నేలటూరు, దామవరం, గొల్లగుంట, కామకూరు, హస్తకావేరి, పిగిలం తదితర గ్రామాలలో కొన్ని పనిముట్లు సేకరించాను. వీటిలో కామకూరు గ్రామంలో సేకరించిన రాతిపనిముట్లు "అఘూలియన్" పని తనంతో ఎంతో నేర్పరితనంగా తయారు చేయబడ్డాయి.

పాత రాతి యుగానికి సంబంధించిన అవశేషాలు దాదాపు 150 గ్రామాలలో లభ్యమైనాయి. ఈ కాలంలో వాడిన పని ముట్లలో చేతి గొడ్డళ్లు, గండ్రగొడ్డళ్లు, చక్రాలు, గోకుడురాళ్లు, ముఖ్యమైనవిగా చెప్పవచ్చు.

మధ్యరాతి యుగానికి చెందిన రాతి పనిముట్లు దాదాపు 50 గ్రామాలలో కనుగొన బడ్డాయి. ఈ యుగం రమారమి 70,000 సంవత్సరాల క్రితం పరిఢవిల్లి వుండవచ్చని తెలుస్తుంది. ఈ కాలంలో పెచ్చుల మీద చేసిన గోకుడురాళ్లు, సూచికలు, ఛిద్రకాలు ముఖ్యమైన పనిముట్లు.

ఉత్తర రాతియుగానికి చెందిన పనిముట్లు నెల్లూరు జిల్లాలో ఇప్పటి వరకు ఒక్క కామకూరు గ్రామంలోనే దొరికాయి. ఈ దశలో ఎక్కువగా పరిశోధనలు జరగక పోవడం వలన వీటి అవశేషాలు చాలా తక్కువగా లభ్యమైనాయి. ఈ శిలాయుగంలో బ్లేడ్‌లు, వాటితో చేసిన చిరు కత్తులు, ఉలి అంచుమొనలు, బాణపు మొనలు ముఖ్యమైన రాతి పనిముట్లు. ఈ కాలము ఇప్పటికి 30,000 నుండి 13,000 సంవత్సరాల మధ్య వరకు సాగిందని చెప్పవచ్చు.

సూక్ష్మరాతి యుగమునకు చెందిన ఆధారాలు

నెల్లూరులో ఇంత వరకు కనుగొనబడలేదు. ఈ యుగంలో రాతి పనిముట్లు చాలా చిన్నవి. అనగా సుమారు కొన్ని మిల్లీ మీటర్ల నుండి నాలుగు సెం.మీ మధ్యలో ఉండే పరికరాలు. వీటితో తమ కావలసిన కొడవళ్లు, బ్లేడ్‌లు బాణపు మొనలు, త్రిభుజాకారాలు మొదలగునవి తయారు చేసుకొనేవాళ్లు.

### నూతన శిలాయుగము

**(క్రీ.పూ.2000సంవత్సరాల నుండి క్రీ.పూ. 1300 లవరకు)**

మానవ చరిత్రలో ఈ యుగం ముఖ్య పాత్ర వహిస్తుంది. ఆదిమ మానవుడు ప్రకృతిలో నదుల ఒడ్డున, చెరువుల అంచులలో పంటలు పండే విధానాన్ని పరికించి, ఆ పంటను ఇతర జంతువుల నుండి కాపాడి తాను వాడుకోవడం మొదలు పెట్టాడు. సూక్ష్మరాతియుగంలో ఇటువంటి పంటపైన మానవుడు ఎక్కువగా ఆధారపడ్డాడు. అయితే పంటలు పండించడం మొదలైంది సూక్ష్మరాతి యుగపు చివరి భాగంలోనేనని పురావస్తు శాస్త్రవేత్తల అభిప్రాయం. కాని పంటలు పండించడం, జంతువులను మచ్చిక చేయడం అనేవి ఒక నిర్దిష్ట పద్ధతిలో మొదలైనది. నూతన శిలా యుగములోనేనని చెప్పవచ్చు. ఆహారం సేకరించే దశ నుండి ఆహారం ఉత్పత్తి చేసే దశకు మానవుడు చేరుకున్నాడు. సంచార జీవనం వదలి స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

నూతన శిలా యుగంలో మానవుడు రాతిగొడ్డళ్లు, బాడిసలు, ఉలి మొనలు మొదలగునవి వాడినాడు. అయితే ఈ రాతి పనిముట్లు నునుపుగా అరగదీసి అంచులు కూనుగా ఉండేటట్లుగా చేసేవాడు. ఈ రాతి గొడ్డళ్లను కట్టెకు బిగించి చెట్లు నరికి, భూమిని వ్యవసాయాను కూలంగా మార్చేవాడు. ఈ కాలానికి చెందిన పనిముట్లు నెల్లూరు జిల్లాలో దువ్వూరు, నల్లగొండ గ్రామాలలో లభ్యమైనాయి.

దువ్వూరులో నునుపు చేసిన రాతి గొడ్డళ్లు ఉలి మొనలతో పాటు మిల్కీ క్వార్ట్జ్ రాతిపై చేసిన బ్లేడులు కూడా లభించాయి. ఈ పనిముట్లు బుచ్చిరెడ్డి పాలెంలో ఉన్న డాక్టర్, సీతారామారావు గారి వద్ద భద్రపరచబడి వున్నాయి.

కొరవ సైవారం

## నరకలోకం నెల్లూరు

-గ్రిద్దలూరు గోపాలరావు

దోమలు
కోతులు
కుక్కలు
పందులు
పశువులు
అపార్థం చేసుకోకండి
దయచేసి వినండి
ఈ సంబోధన
మునిసిపల్ సిబ్బందిని
ఏమాత్రం ఉద్దేశించింది కాదు.
ఘనత వహించిన
మునిసిపల్ పాలనలో
నెల్లూరు నగరంలో
పై ఉదహరించిన
జంతుజాలాల
జనాభాను మించిపోయి
పెనుభూతాల్లా
ప్రమాదకరంగా
వీర విహారంచేస్తున్నాయి
నెల్లూరు నగరవాసుల
నానా బాధలు
వినిపించడమే నా ఉద్దేశ్యం.

గబ్బు!గబ్బు!!గబ్బు!!!
భరించరాని గబ్బు
మామూళ్లగబ్బుకాదు
దాన్ని గురించికాదు చెప్పేది
నెల్లూరుమహానగరంలో
నడిరోడ్లలో చెత్తాచెదారం
పేడా, పెంటల కుప్పలు
ఏరుల్లా నడివీధుల్లో
పొంగి పారే మురికినీరు
పట్టణమంతా పెద్ద
పాయిఖానా
అబ్బా!
గబ్బు!గబ్బు!!గబ్బు!!!
ఈదుర్భరబాధలు
ఈ దుర్గంధ వ్యాధులు
అంతమొందే దెప్పుడు?
నెల్లూరు నగరంలో
నరకలోకం!నరకలోకం
అంతరించే దెప్పుడు?

* * *

## రోజా పాము భయం

అసలు రోజాకు మొదట్నుంచీ పామును చూస్తేనే భయమట. "రాసయ్యా" అనే తమిళ చిత్రం షూటింగ్‌లో ఆమె కాలును ఒక నాగుపాము చుట్టుకుంటే హీరో ప్రభుదేవ కాపాడే సీను. ఆ సంఘటన తర్వాత వాళ్లిద్దరూ ప్రేమించుకుంటారట. ఔట్‌డోర్‌లో ఓ చిన్న కొలనులో రోజా స్నానం చేస్తూంటుంది. ట్రైనింగ్ పొందిన పామును మద్రాసునుంచి తీసుకురానందువల్ల ఆ పల్లెలోనే ఒక పాముల వాడు పట్టి తెచ్చిన ఒక పాముకు నోరు కుట్టి, నీళ్లల్లో వదిలారు. కాని ఎదురుగా జనం, రిఫ్లెక్టర్ల కాంతికి ఆ పాము ఖంగారు చెంది పడగ ఎత్తి, నానా హంగామా చేసేసిందట. ఆమె కాలికి గట్టిగా చుట్టేసుకుంది. లాగడానికి ప్రభుదేవా ఎంత ప్రయత్నించినా రాకపోగా అతని వంక బుసలు కొట్టింది. దాంతో అతను రాబెత్తి పోయాడు. చివరికెలాగో పామును లాగేశారనుకోండి. "మరీ ఇంత అన్యాయమా? ట్రైనింగ్ పొందని పామును తీసుకురావడం ఎంత నిర్లక్ష్యం" అని రోజా ఆ యూనిట్ వాళ్లమీద కోప్పడిందట.

## దాసరి చాకిరేవు!

తన జన్మదినం మే 4 నుంచి తన సంపాదకత్వంలో "చాకిరేవు" అనే రాజకీయ వేత్తలలోని మలినాన్ని ఉతికి ఆరబెట్టే పత్రిక వెలువడుతుందని దాసరి నారాయణ రావు తెలిపారు.

## "ఊర్వశి" అర్చన వివాహం!

రెండుసార్లు "ఊర్వశి" బిరుదు పొందినా 'అర్చన' కు ఛాన్సులు లేవు. ఒక డ్యాన్స్ పార్టీని ఏర్పాటు చేసింది గాని, దానికి సరియైన ఆదరణ లేదు. "నాలో గ్లామర్ లేదు. ఆర్ట్ ఫిలిమ్‌లకు తప్ప మరే సినిమాకు పనికి రాను. ఇప్పుడు ఆర్ట్ ఫిలిమ్స్ తీయడానికి ఎవరు సాహసిస్తారు? అందుకే వివాహం చేసుకోడానికి నిశ్చయించాను." అంది అర్చన.

## నగ్మా స్వంత భవనం

తెలుగు చిత్రాల తర్వాత ఇప్పుడు తమిళంలో బిజీ అవుతున్న నగ్మా మద్రాసు గిండీ ప్రాంతంలో ఒక బ్రహ్మాండమైన భవంతి నిర్మిస్తోంది.

"ఖుష్బూకు తమిళనాడులో ఎక్కడో గుడి కట్టించారట. అలాగే నాకు కూడా ఎవరైనా గుడి కట్టించినా ఆశ్చర్య పోనక్కర్లేదు" అంటోంది నగ్మా.

## ఆలీ డబల్ యాక్షన్ చిత్రం

"మాయా బజారు, ఘటోత్కచుడు" చిత్రాలు పోటా పోటీల మీద తయారవు తూండడంతో ఆ తరహా సోషియో ఫాంటసీ చిత్రాలను తీయడానికి మరి కొందరు నిర్మాతలు ప్రయత్నిస్తున్నారు. హైదరాబాద్‌కు చెందిన ఓ ప్రముఖ వాణిజ్యవేత్త ఆలీ ద్విపాత్రాభినయంతో "ఆలీబాబా-అద్భుతదీపం" అనే చిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. శుభశ్రీ నాయిక.

### కమలాకర కామేశ్వరరావు "భేతాళ కథలు"

విజయా ప్రొడక్షన్స్ పతాకంలో బి. విశ్వనాథ రెడ్డి వారి 'చందమామ' పత్రికలో ధారావాహికంగా వెలువడిన "భేతాళ కథలు" టెలీ సీరియల్‌ను 'దూరదర్శన్' కోసం కమలాకర కామేశ్వర రావు దర్శకత్వంలో నిర్మిస్తున్నారు. సంగీతం : మాధవపెద్ది సురేష్. దీనితో పాటు 13 వారాలపాటు సాగే మరో సీరియల్ "పరోపకారి పాపన్న" కూడా తయారవు తోంది. దర్శకత్వం : పి.సాంబశివరావు.

### సంగీత దర్శకురాలిగా వాణీ జయరాం

ఆ మధ్య ఎస్.జానకి సంగీత దర్శకత్వంలో కొన్ని భక్తి గీతాలు వెలువడ్డాయి. ఇప్పుడు వాణీ జయరాం సంగీత దర్శకత్వంలో ఎనిమిది పాటలున్న ఒక కేసెట్ విడుదల అయింది.

### ఓల్డ్ ఈస్ గోల్డ్

కవి కణ్ణదాసన్ బంధువు పంజు అరుణాచలం తమిళంలో సుప్రసిద్ధ రచయిత, నిర్మాత కూడానూ. "ఓల్డ్ ఈస్ గోల్డ్" అని ఈయన నిరూపిస్తున్నాడు. ఈయన తొలుదొల్త నిర్మించిన "కల్యాణమామ్ కల్యాణం" చిత్రాన్ని నిరుడు "మరుమగళే వా" (పెళ్లి కూతురా రా!)గా

కరవ 11 పేజీలో

## అమ్మోరు విడుదల

మల్లెమాల సుందర రామిరెడ్డి సమర్పణలో ఆయన తనయుడు ఎం.శ్యామ్ ప్రసాద్ రెడ్డి అధిక వ్యయ ప్రయాసల కోర్చి నిర్మిస్తున్న "అమ్మోరు" చిత్రం ఫిబ్రవరి 16 న విడుదలవుతుంది. ఇందులో రమ్యకృష్ణ అమ్మోరు. ఆమె భక్తురాలు సౌందర్య. "భక్తిని నమ్ముకునే వారు కొందరు మూఢాచారాలను నమ్ముకునే వారు మరి కొందరు. వారిరువురి మధ్య సంఘర్షణ ప్రధాన ఇతివృత్తం" అన్నారు డైరెక్టర్ కోడి రామకృష్ణ.



అమ్మదొంగా చిత్రంలో ఆమని

## పాతకంపు: రిక్షారుద్రయ్య

చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

రిక్షా రుద్రయ్య, ఆయన భార్య పార్వతి ఇవి రెండూ ముఖ్యమైన పాత్రలు "రిక్షా రుద్రయ్య" చిత్రంలో. రిక్షా రుద్రయ్య పాత్ర చిత్రం మొత్తాన్ని నడిపిస్తుంది. సినిమా ఈ రెండు ముఖ్యమైన పాత్రలు రచనలో కాని, దర్శకుని భావనా శక్తిలో గాని అంతగా ఎదగలేదు సరైన రూపకల్పన లేని ఈ పాత్రలను కృష్ణంరాజు, జయసుధలు తమ నటనా ప్రతిభతో నిలప గలిగారు. వీరిద్దరికీ ఒక పాట కూడా వుంది. ఆ పాటలోనూ ఇద్దరూ ఒద్దికగా మంచి కదలికలే కనపరిచారు. వీరిద్దరి నటన తప్ప ఇక ఈ చిత్రంలో బాగున్న విషయమంటూ ఏ ఒక్కటీ లేదు. వీరు నటించిన రెండు పాత్రలు తప్ప మిగతా ఏ పాత్రలూ కొంచమైనా చెప్పుకో దగ్గవిగా లేవు.

రిక్షా రుద్రయ్య, పార్వతి పాత్రలు కాకుండా డియస్పీ, ఎస్.పి. ఎస్.ఐ, అన్న అనే రౌడి, ఒక ఫేటా హీరోయిన్, ఇలా మరి కొన్ని పాత్రలున్నాయి. ఇవన్నీ చచ్చు రకం పాత్రలు. ఇలాంటి పాత్రలనే కాదు, ఈ చిత్రంలోని సన్నివేశాలన్నీ కూడా ఇదివరకు చాలా చిత్రాల్లో చూసినవే. అందువల్లే యివన్నీ ముఖం మొత్తేసట్లుగా కనిపిస్తాయి. ఈ పాత్రల్లో నటించిన సత్యనారాయణ, భరత్, శ్రీహరి, రామిరెడ్డి, ఇంద్రజ, ఆలీల నటన చప్పగా వుంది. ఇక దర్శకుడు కె.ఎస్. నాగేశ్వర రావు భావాలలో ఎక్కడా కొత్తదనం కించిత్తు కూడా గోచరించదు. రిక్షా రుద్రయ్య పాత్రలో కృష్ణంరాజు ఇమేజిని అంతగా పెంచలేక పోయాడు దర్శకుడు. ప్రతి సమస్య పరిష్కారానికి ఆ పాత్ర చేత ఇతరులను చావ గొట్టించినంత మాత్రాన ఆ పాత్ర ఇమేజ్ పెరగదు.

అన్యాయాన్ని అరికట్టాలనే ధోరణిలో రుద్రయ్య కొందరిని చావ గొట్టడం, రుద్రయ్యను ఎదుర్కోవాలంటూ అన్న అనే రౌడి (రామిరెడ్డి) మరి కొంత మందిని కొట్టడం, రుద్రయ్య కూతుర్ని చంపటం, పార్వతి పనిచేసే ఆసుపత్రి డాక్టర్ని చంపటం, ఇలా చిత్రమంతా ఫైటింగులు, హత్యలతో దర్శకుడు బోరు కొట్టించాడు.

మాధవపెద్ది సురేష్ సంగీతంలోని చప్పదనం, రమణరాజు ఫోటోగ్రఫిలోని పేలవం చిత్రాన్ని బాగా నీరస పరిచాయి.

కథ కూడా చాలా పాతది. ఈ పాతలోనూ చెప్పుకో దగ్గ విషయం లేదు.

రుద్రయ్య (కృష్ణంరాజు) ఉద్యోగం కోసం చాలా ప్రయత్నాలు చేసి విఫలమై రిక్షా తొక్కుతూ కుటుంబాన్ని పోషిస్తుంటాడు. అతను న్యాయం మీద బ్రతికే వ్యక్తి. అన్యాయం చేసే వారిని చితక బాదుతుంటాడు. రుద్రయ్య తమ్ముడు విజయ్ (భరత్), డియస్పీ (సత్యనారాయణ) కూతుర్ని (ఇంద్రజ) ప్రేమిస్తాడు. విజయ్‌ను డియస్పీ చీవాట్లు పెట్టాడు. అది తెలిసిన రుద్రయ్య, నా తమ్ముణ్ణి నిన్ను మించిన పోలీస్ ఆఫీసర్ని చేస్తానని ఛాలెంజ్ చేస్తాడు డియస్పీతో! విజయ్‌ను ఐ.పి.యస్. పాస్ చేయిస్తాడు. విజయ్ ఎస్పీగా ఆ బస్తీకే వస్తాడు. సబ్ ఇన్స్పెక్టర్ అండతో రౌడీగా చలామణి అవుతున్న అన్న అనే రౌడి (రామిరెడ్డి) రిక్షా రుద్రయ్యపై కక్ష సాధించేందుకు

కరవ 11 పేజీలో

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతి రూ. 2/-



**In the Court of the Sub. Judge : Kovur**

E.P. 38 / 92 : O.S. 2 /81

State Bank of India (ADB) Kovur rep. by its Manager - Petitioner

Vs

Vemireddy Raja Rami reddy - Respondent

The schedule mentioned property belonging to the respondent is being auctioned on 23.1.95 between 10.30 A.M.to 5.00 P.M. before the above court premises. The intending bidders may participate in the said auction.

SCHEDULE

Nellore Dist. Kovur Sub Registration, Gandavaram Village

Item No. 1(a) : S.No. 747/3 Ac. 2.74 or 1.096 Hec. (full extent) wet land

Petitioner's Value Rs. 8,250/-

Amin's Value Rs. 41,000/-

Item No. 1 (b): Patta No. 683, S.No. 749, Ac. 5.96 or 2.384 Hec. (Full extent) wet land

Petitioner's Value Rs. 15,000/-

Amin's value Rs. 89,400/-

I. Item No. 1(b) was mortgaged on 15.6.74 for Rs. 2,500/- to M.P.C. society, Gandavaram under declaration mortgage.

II. 1 (a) and (b) were martgaged on 17.12.74 for Rs. 600/- to M.P.C. Society, Gandavaram.

III. The above and others were mortgaged to Decree holder / Petitioner. The above shown mortgages to M.P.C. society, Gandavaram were completely discharged. Hence the sale of the above items will be held free of encumbrances.

W. Subrahmanyam

Date 5.1.95 Advocate - Kovur

## నెల్లూరు సంగతులు

4వ పేజీ తరువాయి

చెప్పారు. మాజీ ఎమ్మెల్యే సి.వి. శేషారెడ్డి, డాక్టర్ జి. కొండారెడ్డి, ఎస్.సి. డిఎస్‌పి దామోదరం, టౌన్ సిఐలు వీరారెడ్డి, కంపా ప్రసాద్ తదితరులు మాట్లాడారు. పలువురు ఎస్ఐలు ఆయనను పూలమాలలతో ముంచెత్తారు.

### టౌన్ యూత్ కాంగ్రెస్‌కు కొత్త అధ్యక్షుడు

ఇందిరా భవన్‌లో జరిగే సమావేశాల్లో జిందాబాద్‌ల కార్యక్రమంతో దడబడలు సృష్టిస్తుండే ఎం.నవీన్ బాబును టౌన్ యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడిగా నియమించారు. బాబు జిల్లా వద్దెర యూత్ అధ్యక్షుడు; డిసిసి కార్యదర్శి దేవకుమార్ రెడ్డి అనుచరుడు; పార్టీ మీటింగులకు, కార్య క్రమాలకు కార్యకర్తలను తరలించుకు వచ్చే క్యాడర్ వున్న యువకుడే. ఇటీవల హత్యకు గురైన సయీద్ మరణంతో ఈ పదవి ఖాళీ అయింది.

### రైతులతో కమిటీలు వేయాలి

ఆచార్య పిసి రెడ్డి అధ్యక్షతన 4 తేది రైతు సంఘ సమావేశం జరిగింది. మార్కెట్‌లో లభించే రసాయన ఎరువుల్లో చాలా భాగం కల్తీతో కూడుకొని వున్నవని, వీటిపై నిఘా అవసరమని తీర్మానించారు. చెరువులు, కాలువలకు గండ్లు పడిన చోటే ప్రతి ఏడాది మరలా పడుతున్నాయని, ఎస్టిమేట్లకు మించి టెండర్లు వేసినప్పటికి, చేసిన కాంట్రాక్టులు లోప భూయిష్టంగా వుంటున్నందున గ్రామ రైతులను కమిటీలలో చేర్చి వారి సలహాలతో నిర్మాణ పనులు చేపట్టాలని కోరారు. చెరకు ఫ్యాక్టరీ యాజమాన్యం రైతులకు గతంలో వలె వుచితంగా రెండు బస్తాల యూరియా పంపకం చేయాలని సమావేశం కోరింది. సమావేశంలో రైతుసంఘ కార్యదర్శి కె. చంద్రమోహన రెడ్డి, జక్కా రంగారెడ్డి, గునపాటి రామచంద్రయ్య తదితరులు పాల్గొన్నారు.

### వాయిదా పడ్డ క్రికెట్ టోర్నమెంట్

కనుపర్తి పాడులో 9 తేది నుంచి 16 వరకు జరగ వలసిన మధు మెమోరియల్ క్రికెట్ పోటీలు వర్షాల కారణంగా వాయిదా పడ్డాయి. వీటిని 20 తేది నుండి 26 వరకు నిర్వహిస్తున్నట్లు నిర్వాహకులు తెలిపారు. జూనియర్ బాయిస్ విభాగంలో 16 సంవత్సరాల లోపు వయస్సు గలవారు అర్హులు, వయస్సు నిర్ధారణ సర్టిఫికెట్ జత పరచాలని కోరుతున్నారు. 20 ఓవర్లకు పోటీ జరుగుతుంది. ఫైనల్స్‌లో మాత్రం 25 ఓవర్లు వుంటాయి. విన్నర్స్‌కు 2,500; రన్నర్స్‌కు 1,116. ఇతర వ్యక్తిగత బహుమతులు వుంటాయి. అదనపు వివరాలకు బి.వి. రమణా రెడ్డి, అడ్వొకేట్, గుంటూరు హౌస్, పాగతోట, నెల్లూరులో సంప్రదించవచ్చు.

### కళామందిర్ పోటీలలో విజేతలు

కళామందిర్ కల్చరల్ అసోసియేషన్ నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలు టౌన్ హాల్‌లో జనవరి 6, 7, 8 తేదీల్లో జరిగాయి. మొదటి రోజు కార్యక్రమంలో ఎలక్ట్రికల్ చీఫ్ ఇంజనీర్ ఎస్. గురుమూర్తి రెడ్డి, ఎస్.ఇ. కె. వెంకట్రామి రెడ్డి, డివిజనల్ ఇంజనీర్ టి. రాధాకృష్ణా రెడ్డి, సినీ నిర్మాత పి.ఎ.కె. రెడ్డి, డాక్టర్ వై. సంజీవ రావు పాల్గొన్నారు. గూడూరు లేబర్ ఆఫీసర్ దేవరపల్లి నాగయ్య, ఆడిటర్ ఆర్.వి. శేషయ్య నాయుడు, మురళి కృష్ణ హోటల్ అధినేత గోపాలయ్యను కళామందిర్ అధ్యక్షుడు టి.దాశరథి దుశ్శాలువలతో సత్కరించారు. అనంతరం జరిగిన సంగీత పోటీల్లో 3 సంవత్సరాల బాలుడు పి.ధీరజ్ పిట్ట కొంచెం కూత ఘనంలా ప్రేక్షకులను తన గానంతో అబ్బుర పరిచాడు. పోటీలకు సుబ్బారావు, నాట్యాచార్య ఎస్.వి. రమణయ్య న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. సినిమా పాటల సీనియర్స్ విభాగంలో డి.మధుసూదన రావు, బి.శైలజ, జి.ప్రభాకర్ విజేతలుగా నిలిచారు. శాస్త్రీయ సంగీతంలో జె.కృష్ణ, వి.ఎ.ఎన్. కిరణ్మయి, కె.సుష్మ, లలిత సంగీతంలో పి.ఎం. ప్రకాశ్, పి.భాగ్యలక్ష్మి, బి. వెంకట్ బహుమతులు పొందారు. భరత నాట్యంలో బి. నారాయణ మూర్తి, టి.కిషోర్ కుమార్, బి.రుక్మిణి, జానపద నృత్యంలో శేఖర్ బాబు, యెహోషా వరుస స్థానాలలో నిలిచారు. వేణు గానంలో ఎల్.వి. ఉమా మహేశ్వర రావు విశేష ప్రతిభ చూపి బహుమతి పొందారు.

### స్త్రీ స్వేచ్ఛ కోసం పరితపించిన చలం

ప్రముఖ కవి చలం శత జయంతి ఉత్సవాలను పురస్కరించుకొని టౌన్‌హాల్‌లో 8 తేది చర్చా గోష్టి నిర్వహించారు. ఆర్.టి.సి. డివిజనల్ మేనేజర్ ప్రభాకర మూర్తి అధ్యక్షత వహించిన, గోష్టిలో రిటైర్డ్ జడ్జి కె.వి. నారాయణ రావు, విప్లవ రచయితల సంఘానికి చెందిన వి. చెంచయ్య, కె.వి. రమణా రెడ్డిల తోపాటు డాక్టర్ లక్ష్మి సుహాసిని, శోభా దేవి, అద్దేపల్లి రామ్మోహన్ తదితరులు పాల్గొని గోష్టికి నిండుతనం కూర్చారు. తాను చవిచూసిన జీవితంలో ఎక్కడా స్త్రీకి స్వేచ్ఛ లేదని, విద్యలో, ప్రేమలో, పెళ్లిలో, రాజకీయాలలో, స్నేహాలలో, అభిరుచులలో స్త్రీ స్వేచ్ఛను అనుభవించాలని చలం పరితపించి పోయారని పలువురు అభిప్రాయ పడ్డారు. స్త్రీకి హృదయం వుంది, దానికి అనుభవం ఇవ్వాలి; స్త్రీకి మెదడు వుంది దానికి జ్ఞానం ఇవ్వాలని చలం తన కథల్లో, నవలల్లో, వ్యాసాల్లో వాపోయాడని చెంచయ్య అభిప్రాయ పడ్డారు. సమాజానికి కాక, రేపటి సమాజానికి ఆదర్శ వంతమైన రచన చలం బిడ్డల శిక్షణ అని; దీని నుంచి ఉపాధ్యాయులు, తల్లి దండ్రులు నేర్చు కోవాల్సింది ఎంతో వుందని డాక్టర్ లక్ష్మి సుహాసిని అన్నారు. బిడ్డలను శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతంగా పెంచాలంటే ఎటువంటి సమాజం కావాలో ఆ సమాజాన్ని చలం వాంఛించినట్లు కె.పి. నారాయణ రావు వెల్లడించారు. తగిన ప్రచారం వుంటే సభ మరింత జయప్రద మయ్యేది.

### వి.ఆర్. కాలేజీలో ఈవ్ టీజింగ్

వి.ఆర్. కళాశాలలో ఇటీవల ఈవ్ టీజింగ్ పెచ్చు పెరిగి అబ్బాయిలు పోటీలు పెట్టుకొని అమ్మాయిలను ముద్దులు పెట్టి వేధించే స్థాయి వరకు వెళ్లింది. ఈ సంఘటన జరిగిన తరువాత విద్యార్థినులు కళాశాలకు రావడం తగ్గిపోయే సరికి యాజమాన్యం ఈ విషయమై చర్చించి కొన్ని దృఢ నిర్ణయాలు తీసుకొంది. దాని ఫలితంగానే ముగ్గురు బి.ఎస్‌సి. రెండవ సంవత్సరం చదివే విద్యార్థులను సస్పెండ్ చేసినట్లు ప్రిన్సిపాల్ డాక్టర్ ఎం. గోపాల కృష్ణమూర్తి చెప్పారు. వివేక్, నిరంజన్, శరత్‌లలో నిరంజన్ ప్రవర్తన మితి మీరి పోయిందని, మిగతా ఇద్దరు అసభ్య పదజాలం వాడడం వల్ల టి.సి.లు ఇచ్చి ఇంటికి పంపుతున్నట్లు వివరించారు. గతంలో శేఖర్ అనే విద్యార్థిని సస్పెండ్ చేశాక కూడా ఈ ముగ్గురిలో మార్పు రాలేదని, ఇకనుండి విద్యార్థుల కదలికలను పర్యవేక్షించేందుకు కొంత మంది ఉపాధ్యాయులను ప్రత్యేకంగా నియమిస్తున్నట్లు తెలిపారు. ఆదిలోనే ఈవ్ టీజింగ్‌ను అరికట్ట కుంటె వి.ఆర్.సి.లో ఏదో ఒక అఘాయిత్యం తప్పక జరిగి వుండేది. కాలేజీలో క్లాసులు సక్రమంగా జరిగే విషయంలో కూడా యాజమాన్యం శ్రద్ధ తీసుకోవాల్సి వుంది.

### పామోలిన్ తోటల పెంపకానికి అనుకూలం!

జిల్లాలో పామోలిన్ తోటల పెంపకానికి 35 వేల హెక్టార్ల భూమి అనుకూలంగా వున్నట్లు వుద్యానవన శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ గోపాల కృష్ణారెడ్డి చెప్పారు. జిల్లాలో లక్ష ఎకరాలు తోటలు; పెంచడానికి అనుకూలంగా వున్నట్లు వివరించారు. నిమ్మ, బత్తాయి తోటల పెంపకానికి గూడూరు డివిజన్ అనుకూలంగా వున్నట్లు తెలిపారు. నెల్లూరు డివిజన్‌లో అరటి, కొబ్బరి, తమలపాకుల తోటలు, కావలి డివిజన్‌లో మామిడి తోటల దిగుబడులు బాగుంటాయని వివరించారు. జిల్లాలో పూల తోటలు, కూర గాయలు బ్రహ్మాండంగా పండించ వచ్చుంటున్నారు. సన్న, చిన్నకారు రైతుల సహాయార్థం కొబ్బరి, మామిడి, నిమ్మ వేసుకొనే రైతులకు మొలకలు 50 శాతం సబ్సిడీకి ఇస్తున్నట్లు చెప్పారు. పామోలిన్ మొక్కల పెంపకం ద్వారా సంవత్సరానికి 10 నుంచి 15 వేల ఆదాయం వస్తుందని; జిల్లాలో 26 మండలాల్లో ఈ మొక్కలు పెంచడానికి అనువైన వాతావరణ ముందన్నారు. ఒక హెక్టార్ పామోలిన్ పెంపకానికి 38 వేల రూపాయలు ఖర్చు అవుతుందని, అందులో 16,250 సబ్సిడీ ఇస్తామని, రైతులు ఈ అవకాశాన్ని వినియోగించు కోవాలని గోపాల కృష్ణారెడ్డి కోరారు.

### అప్రోచ్ రోడ్డు నిర్మాణానికి ఎమ్మెల్యే శంకుస్థాపన

విజయ మహల్ బాక్స్ టైప్ బ్రిడ్జి వద్ద అప్రోచ్ రోడ్ల నిర్మాణానికి 6 తేది ఎమ్మెల్యే రమేష్ రెడ్డి శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంగా అక్కడ గుమిగూడిన ప్రజల నుద్దేశించి మాట్లాడారు. మునిసిపల్ ఛైర్మన్ అయినప్పటి నుంచి బ్రిడ్జి నిర్మించి తీరాలన్న పట్టుదలతో పని చేసినట్లు చెప్పారు. అనేక సార్లు దక్షిణ మధ్య రైల్వే జనరల్ మేనేజర్‌ను కలిసి పరిస్థితి వివరించి నిర్మాణానికి అనుమతి పొందినట్లు తెలిపారు. తర్వాత ఇన్వెస్టి గేషన్ ఫీజు కింద యాభై వేల రూపాయలు, మునిసిపల్ వాటా 30 లక్షలు, ఎమ్మెల్యే గ్రాంట్ నుంచి పది లక్షలు రైల్వే శాఖకు చెల్లించిన విషయాన్ని గుర్తుకు తెచ్చారు. బాక్సు టైప్ బ్రిడ్జికి సుమారు కోటి రూపాయలు ఖర్చవుతుందని, మునిసిపాలిటి సగం, రాష్ట్ర ప్రభుత్వం సగం భరిస్తుందని నిర్మాణం పూర్తిచేయను ఆరునెలలు పడుతుందన్నారు. అప్రోచ్ రోడ్లను 50 లక్షలు ఖర్చు పెడుతున్నారని, 16 లక్షలు స్థల సేకరణకు వ్యయపరచ మన్నట్లు వివరించారు. బ్రిడ్జి కూరగాయల మార్కెట్‌ల ప్రారంభానికి 'అన్న' ను తీసుకొస్తానని చెప్పారు. కార్యక్రమంలో సిపిఎం మాజీ కౌన్సిలర్ వున్నం బసవయ్య, ఆచార్య పిసి రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### రోగులకు రామకృష్ణ సేవాసమితి దుప్పట్లు!

రామకృష్ణ పరమ హంస సతీమణి శారదా మాత 141వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని రామకృష్ణ సేవా సమితి టి.బి. ఆస్పత్రిలోని రోగులకు దుప్పట్లను వుచితంగా పంపిణీ చేసింది. ఆస్పత్రిలోని వార్డులకు కర్టెన్లు, కిటికీలు, తలుపులు లేనందున రోగులకు తప్పక వుపయోగ పడగలవని వీటిని పంపిణీ చేసినట్లు సమితి అధ్యక్షుడు జె.వి. రెడ్డి చెప్పారు. 246 దుప్పట్లను కార్యదర్శి ఎన్.వి. నరసింహా రావు, సహ కార్యదర్శి లక్ష్మీనారాయణ రావు, ఓబులేసు శర్మ, మాలకొండయ్య, ఎం.ఆర్. సుబ్రహ్మణ్యం తదితరులు పంచారు.

## 50 ఏళ్లక్రితం

3 వపేజీ తరువా

3 తేదిన నవాబుపేట సత్రాల రుక్మిణమ్మగారు గొబ్బిరొట్టెవారికి భిక్షం పెట్టకుంటే మాని వేడినీళ్లతి పోసిందట. 6 తేది ఈ సత్కార్యానికి ఆమెగారిని బెంచికోర్టువారు 5రూ. జరిమానాతో బహుకరించారు.

## జనవాణి

3పేజీ తరువాయి

పరిస్థితి అధ్వాన్నంగా వుంది. గత ఏడు సంవత్సరాలుగా రోడ్ల మరమ్మత్తు చేయించక పోవడం వల్ల ఈ ప్రాంత ప్రజలు ఈ రోడ్లపై నడవలేక పోతున్నారు. 90 అక్టోబర్ నెలలో టెండర్ల పని పూర్తి అయింది. కాని ఇంతవరకు పని ప్రారంభించ లేదు. పాల బూతు సెంటర్‌లో వున్న రోడ్డు కూడా బాగాలేదు. నిరంతరం రద్దీ వుండే రోడ్డు ఇది. ఈ విషయాన్ని మునిసిపల్ కమీషనర్ దృష్టికి తీసుకెళ్లినా ఫలితం కనబడటం లేదు. పని తొక్కి పెట్టడంలో అధికారులు పక్షపాతం చూపిస్తున్నారు. ఈ ధోరణి మార్చుకోకుంటే వుద్యమించక తప్పదు.

నెల్లూరు - పందిళ్లపల్లి అరుణమ్మ

### క్వాలిఫైడ్ టీచర్లకు అన్యాయం!

గత సంవత్సరం టీచర్ పోస్టుల కొరకు కాంగ్రెస్ ప్రభుత్వం హడావుడిగా దరఖాస్తులను ఆహ్వానించింది. ఈ పోస్టుల విషయమై కొంతమంది క్వాలిఫైడ్ టీచర్లు కోర్టును ఆశ్రయించారు. టీచర్ పోస్టులకు జిల్లాలో నిర్వహించిన పరీక్షలో 1700 మంది వుత్తీర్ణు లయ్యారు. ఖాళీగా వున్న 1100 పోస్టులు. బి.ఇడి.లతో కలుపుకుంటే 1200 మంది వుద్యోగాలలో నియమింప బడతారన్న ఆనందంలో వుండగా కోర్టు ఇచ్చిన వుత్తర్వు శాపమయ్యింది. 1:3 వంతు లెక్కన ఇంటర్వ్యూలు మళ్లీ నిర్వహించాలని కోర్టు ఆదేశించింది. ఈ వంతున ఇంటర్వ్యూలకు ఇదివరకు వెళ్లిన 1700 మంది కాక మరో 1600 మంది క్వాలిఫైడ్ కానివారు కూడా హాజరౌతారు. దీనివల్ల క్వాలిఫైడ్స్‌కు అన్యాయం జరుగుతుంది. ఈ విషయమై ప్రభుత్వం తగిన నిర్ణయం తీసుకోవాలని విజ్ఞప్తి.

నెల్లూరు - టి.వి.సురేష్‌బాబు

### నాయుడుపేట ట్రాఫిక్‌ను ఎవరూ పట్టించుకోరా?

ఓజిలి నుండి నాయుడుపేట వరకు సాగే జాతీయ రహదారి అత్యంత అధ్వాన్న స్థితిలో వుంది. స్వర్ణముఖిపై నిర్మించిన బ్రిడ్జి ప్రారంభానికి ముందే కూలిపోయి ప్రభుత్వ అసమర్థతకు సవాల్‌గా నిలిచింది. దీనివల్లే ప్రతిరోజూ ట్రాఫిక్ జామ్‌తో దూర ప్రయాణీకులు పడరాని పాట్లు పడుతున్నారు. గతంలో నాయకులకు ఈ సమస్య గూర్చి ప్రజలు విన్నవించి విసిగి పోయారు. కొత్త ఎమ్మెల్యేలైనా ఈ సమస్య పట్ల శ్రద్ధ వహించి ప్రజల కడగండ్లను తీర్చాలి!

వెన్నూరు - పి.శ్రీరాములు

### గ్రామీణ ప్రాంతాల్లో వైద్యం సమకూర్చాలి!

ప్రజలందరికీ వైద్య సేవలు అందించాల్సిన బాధ్యత ప్రభుత్వంపై వుంది. వైద్యం ఖరీదైన వ్యవహారంగా మారిన ఈ రోజుల్లో ప్రభుత్వ బాధ్యత మరింత పెరిగింది. ప్రభుత్వాసు పత్రుల్లో వైద్య సేవలు చాలా అధ్వాన్నంగా వుంటున్నాయి. ప్రభుత్వం కూడా నగరాల్లోని అనుపత్రుల ఆధునీకరణ పైనే శ్రద్ధ చూపిస్తున్నది. గ్రామీణ ప్రాంతాల అనుపత్రులపై సవతి తల్లి ప్రేమ ప్రదర్శిస్తూంది. ఈ అనుపత్రులలో తగిన సిబ్బంది, డయాగ్నసిస్ వసతులు వుండనే వుండవు. మందుల కొరత వెంటాడు తుంటుంది. రెక్కాడితే గాని డొక్కాడని నిరుపేదలు ప్రభుత్వ అస్పత్రికి వెళ్లి తీవ్ర నిరాశ నిస్పృహలతో తిరిగి వస్తున్నారు. ప్రభుత్వం సత్వరమే వైద్య సేవలను మెరుగు పర్చాలి. ఇందుకు నిధుల కొరత ప్రధాన అడ్డంకి కాకుండా చూడాలి. హెల్త్‌సెస్, కార్పస్ ఫండ్ ఇతరత్రా మార్గాల ద్వారా వనరులను సమీకరించు కోవాలి. అందరికీ వైద్య సేవలు అందించి నప్పుడే అది సంక్షేమ ప్రభుత్వం అవుతుంది.

గూడూరు - కె.వి.రమణ

### నియమ నిబంధనలన్నీ వుద్యోగులకేనా?

ప్రభుత్వ నియమ నిబంధనలన్నీ వుద్యోగులకే గాని మరెవ్వరికీ వర్తించవు. సంవత్సరానికి 5 లక్షల టర్నోవర్ చేసే వ్యాపారికి ఎటువంటి లెక్కలు చూపించక 1400 రూపాయల పన్ను చెల్లిస్తే సరిపోతుంది. ఆదాయం పన్ను శాఖ అతడ్ని ఏ విధంగానూ ప్రశ్నించదు. కానీ ఏడాదికి 60 వేలు జీతం తీసుకొనే వుద్యోగి పొదుపు పథకాల్లో డబ్బు దాచుకోక పోతే వెయ్యి రూపాయలు పన్ను కట్టాలి. ధరలు పెరిగి నప్పుడల్లా కంటి తుడుపుగా పెంచే కరువు భత్యంపై కూడా ఆదాయ పన్ను వేస్తారు. ఇంటి అద్దె అలవెన్సు పై కూడా పన్ను కట్టాలి. అవినీతికి పాల్పడు తున్నారని వుద్యోగుల పైన, మితిమీరిన ఆస్తు లున్నాయని రిటైరయిన వుద్యోగుల పైన దాడిచేసే అవినీతి నిరోధక శాఖ అధికార్లకు రాజకీయ నాయకులు కనపడరు. కళ్లముందే పది తరాలకు సరిపడా కోట్లాది రూపాయలు మూట గట్టు కొంటున్నారు. అయినా ప్రభుత్వ యంత్రాంగం నిమ్మకు నీరెత్తి నట్లుంది.

నెల్లూరు - వి.వి.శశికుమార్

### శ్రీరాములు జిల్లాగా ఎందుకు మార్చాలి?

ఇటీవల కొంతమంది ఆర్యవైశ్య నాయకులు అదిపనిగా పొట్టి శ్రీరాములు జిల్లా గూర్చి మాట్లాడు తున్నారు. జిల్లా పేరు మార్చకపోతే ఏం మునిగి పోతుందో అర్థం కావడం లేదు. శ్రీరాములు జిల్లాగా పేరు మార్చినంత మాత్రాన వైశ్యుల స్థితి గతులు మారుతాయా? జిల్లాలో అనేక మంది బీద వైశ్యులు పూట గడవక, బిచ్చ మెత్తలేక అల్లో రామచంద్రా అని అలమటిస్తుంటే అటువంటి వారి గూర్చి ఆలోచించే వాడే లేడు. రాజకీయంగా ఎదగాలని పలువురు వైశ్య నాయకులు వులలాట పడుతున్నారు. ఈ నాయకులు ముందుగా వైశ్య కులంలోని నిరు పేదలను గుర్తించి వారికి ప్రభుత్వపరంగా గాని, దాతల పరంగా గాని సహాయ సహకారా లందిస్తే అందరి అభిమాన పాత్రు లవుతారు. అంతేకాని పునాది లేని నిర్మాణం లాగా పెద్ద వాటిని గూర్చి మాట్లాడి పదిమందిలో చులకన కావడం తప్ప వేరే ప్రయోజనం లేదు.

నెల్లూరు - ఎల్. రామసుబ్బయ్య

### ప్రతిపక్ష పార్టీలు వున్నచోట మద్య నిషేధం విధించాలి!

నెల్లూరు జిల్లా దూబగుంట గ్రామ మహిళలు స్వచ్ఛందంగా ప్రారంభించిన సారా వ్యతిరేక వుద్యమం అంచెలంచెలుగా ఎదిగి సంపూర్ణ మద్య నిషేధానికి దారి చూపింది. కాంగ్రెస్ పార్టీ మద్య నిషేధం పట్ల చిత్తశుద్ధితో వ్యవహరించలేక పోయింది. సారా నిషేధమని చెబుతూ చీప్ లిక్కరును ప్రవేశ పెట్టింది. సంపూర్ణ మద్య నిషేధాన్ని కోరుతూ ధర్నా చేసిన మహిళలపై లాఠీల బలం చూపి మగువల ఆగ్రహాన్ని చవిచూసింది. వుద్యమం జరిగే రోజుల్లో అన్ని ప్రతిపక్ష పార్టీలు వుద్యమానికి మద్దతు ప్రకటించి అధికారంలో వున్న పార్టీని దుమ్మెత్తి పోశాయి. ఇప్పుడు పశ్చిమ బెంగాల్, ఢిల్లీ, ఒరిస్సా, బీహార్, ఉత్తర ప్రదేశ్, కర్ణాటక, రాజస్థాన్, తమిళనాడులో ప్రతిపక్ష పార్టీలు అధికారం వెలగ బెడుతున్నాయి. జాతీయ పార్టీల పక్షాలకు చెందిన ఈ రాష్ట్రంలోని శాఖలు సంపూర్ణ మద్య నిషేధానికి తీర్మానాలు చేసి పంపితే బాగుంటుంది. నాడు స్వాతంత్ర్యోద్యమంలో గాంధీగారు కల్లు మానండోయ్-కల్లు తెరవండోయ్ అని పిలుపునిచ్చారు. కల్లును కూడా నిషేధించి గాంధీగారి ఆశయాన్ని నిజం చేస్తారని ఆశిద్దాం.

ములుమూడి -పి. జానకిరామరావు.

### పార్టీ ఔన్నత్యాన్ని ఎవరూ చెప్పలేదు!

కాంగ్రెస్ పార్టీకి అంతకంటే మెరుగైన విధానాలుగల ప్రజాస్వామ్య, లౌకిక, దేశభక్తి పార్టీ ప్రత్యామ్నాయం కావాలి. అంతేగాని ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొట్టే తెలుగు దేశం పార్టీ ఎన్నటికీ ప్రత్యామ్నాయం కానేరదు. ఈ విషయాన్ని వామపక్ష పార్టీలు కూడా గుర్తించక పోవడం విచారకరం. కాంగ్రెస్ పార్టీకి ఘనమైన చరిత్ర, సంస్కృతి వుంది. దేశానికి ఎంతో సేవచేసి వుంది. దురదృష్టమేమిటంటే మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో ఏ కాంగ్రెస్ అభ్యర్థి ప్రజలను కాంగ్రెస్ చరిత్రను సంస్కృతిని అది సాధించిన విజయాలను గురించి నూతన విధానాల గురించి చెప్పలేదు. విధానాలవల్ల దేశానికి చేకూరిన లాభం లాభల గురించి ప్రస్తావించలేదు. హరిజనులు, గిరిజనులు, బిసిలు, మైనార్టీలకు చేసిన సేవ గురించి బహిరంగ సభల్లో కరపత్రాలు మైకుల ద్వారా ప్రచారం చేయలేదు. ఎంత సేపటికీ గ్రూపు నాయకులు, ఇతర హేయ పద్ధతులద్వారా గెలవాలను కున్నారు. దీనివల్లే ఓడి పోయారు. ఇకనైనా పార్టీ నాయకులు ఈ విషయం గుర్తిస్తే మంచిది.

కావలి -పి.వి.నరసింహాచార్యులు

### ఎన్టీఆర్‌ను విమర్శించకండి!

ఎన్టీ రామారావు ముఖ్యమంత్రి అయిన తర్వాత నుంచి జమీన్‌రైతులో తెలుగుదేశం పార్టీ వ్యతిరేక వ్యాఖ్యలు ఎక్కువయ్యాయి. ఆయనకు ఎన్ని బలహీనతలున్నా ప్రజలు ఏరికోరి ఎన్నుకొన్నారు కాబట్టి ప్రజాస్వామ్యం దృష్ట్యా విమర్శించ కూడదు. గతంలోను, ఇప్పుడూ సరి దిద్దుకోలేని తప్పులు ఆయన జీవితంలో వున్నాయి. కానీ జనం ప్రతిపక్షాన్ని సైతం లేకుండా ఎన్టీఆర్‌ను గెలిపించారు. ప్రజాస్వామ్యంలో భాగమైన పత్రికగా జనాన్ని చైతన్య పరచడం తప్పుకాదు గాని, ప్రజలచే ఎన్నుకోబడ్డ ఎన్టీఆర్‌ను ఉత్తి పుణ్యానికే విమర్శించకండి.

నెల్లూరు - వి.విష్ణు

### కావలి టెలిఫోన్లు

ఏప్రెల్ 94కు కావలిలో టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఎలక్ట్రానిక్ అయ్యి. కొత్త కనెక్షన్లు ఇవ్వ బడుతాయని రాజధాని లోని వున్నత టెలికాం అధికారులు తెలియ జేశారు. కావలి టెలికాం సిబ్బంది పనిచేస్తూనే వున్నారు. పిల్లర్స్ తనిఖీ, ఇళ్లకు వైరు ఇవ్వడం తదితరాలు పూర్తి అయ్యాయి. కాని కనెక్షన్లు మాత్రమే ఇవ్వకుండా ప్రజల సహనాన్ని పరీక్షిస్తున్నారు. నూతన సంవత్సర కానుకగా నైనా టెలిఫోన్ కనెక్షన్స్ ఇవ్వాలని కోరిక.

కావలి - సి.హెచ్.నాగేశ్వరరావు

### సినిమా

9 పేజీ తరువాయి

పునర్నిర్మించి మళ్లీ సూపర్ హిట్ చేశారు. 20 ఏళ్ల క్రితం ఈయన నిర్మించిన "ఎంగమ్మా శపథం" ఇప్పుడు "వనజ-గిరిజ"గా త్వరలో విడుదలవ బోతోంది. కుష్బూ, మోహిని ధరిస్తున్న పాత్రలను ఇదివరకు జయచిత్ర, విదుబాల నిర్వహించారు. ఈ చిత్రం అప్పుడే బిజినెస్ అయిపోయింది.

### ప్రభుదేవా డిమాండ్

నృత్య దర్శకుడుగా ప్రవేశించి, డాన్సర్ అయి, "ప్రేమికుడు" చిత్రంతో హీరో అయిన ప్రభుదేవ ఇప్పుడు ఒక చిత్రానికి 20 లకారాలు అడుగు తున్నాడట. అంతే కాదు; "మిస్టర్ రోమియో" అనే తమిళ చిత్రంలో తన సరసన నాయికగా బొంబాయి తార శిల్పా శెట్టిని బుక్ చేసి తీరాలని పట్టుబట్టి, చివరకు విజయం సాధించాడు.

### సంక్రాంతి తర్వాత విడుదలయ్యే చిత్రాలు

విజయశాంతి నటించిన "లేడీబాస్", రాజశేఖర్ పాల్గొన్న "రాజసింహం", అశ్వని నాచప్ప చివరి చిత్రం "మిస్ 420", కృష్ణంరాజు, సుమన్‌ల "లీడర్" తోపాటు మరో నాలుగు చిత్రాలు జనవరిలోనే విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. వీటిల్లో ఎక్కువ చిత్రాలు విజయ వంతమైతే తెలుగు సినిమా జగతికి 1995 శుభారంభంగా భావించవచ్చు.

### విడుదలైన చిత్రానికి మళ్లీ రీరికార్డింగ్

"జగదేక వీరుడు - అతిలోక సుందరి" చిత్రం విడుదలైన చాలా కాలానికి ఇప్పుడు మలయాళంలో డబ్ చేయబడుతోంది. "హాయ్, సుందరి!" అన్న పేరును నిర్మాత జయకుమార్ నిశ్చయించారు. కాని, నేపథ్య సంగీతంలో కొంత మార్పు ఉంటే బావుంటుందని భావించిన ఆ నిర్మాత మళ్లీ ఇళయరాజా చేతనే కొత్తగా రీరికార్డింగ్ చేయించారు. భూలోకానికి వచ్చిన శ్రీదేవి తిరిగి తన శక్తులను పొందే సన్నివేశానికి 'కంప్యూటర్' పై ఇళయరాజా కుమారుడు హాలీవుడ్ చిత్రాల స్థాయిలో సంగీతం సమకూర్చాడు.

### "ప్రొఫెసర్ విశ్వం"

చందమామ విజయా కంబైన్స్ తమిళంలో కమలహాసన్‌తో నిర్మించిన "నమ్మవర్" చిత్రాన్ని తెలుగులో పై పేరున అనువదిస్తున్నారు. మాటలు, పాటలు : వెన్నెలకంటి. దర్శకత్వం : సేతు మాధవన్. ఇదే సంస్థ ఏప్రెల్ నుంచి బాలకృష్ణతో నిర్మించే సాంఘిక చిత్రానికి సింగీతం శ్రీనివాస రావు దర్శకుడు. బి. వెంకట్రామిరెడ్డి నిర్మాత. సంచాలకుడు : రావి కొండలరావు. ఈ చిత్రం షూటింగ్ మద్రాసులోనే జరుగుతుంది.

### దాసరి, బాలకృష్ణతో రమా ఫిలిమ్స్ చిత్రం

దాసరి దర్శకత్వంలో తొలిసారిగా బాలకృష్ణ నటించే చిత్రాన్ని నటుడు కైకాల సత్యనారాయణ సమర్పిస్తారు. కె. నాగేశ్వర రావు నిర్మాత.

### ఎ.కోదండ రామిరెడ్డి తీస్తున్న చిత్రాలు

చిరంజీవి, బాలకృష్ణ, నాగార్జున, కృష్ణ నటించే చిత్రాలకు తాను దర్శకత్వం వహించ బోతున్నట్లు ఎ.కోదండ రామిరెడ్డి చెప్పారు. ఇవన్నీ ఈ ఏడు ప్రథమార్థంలోనే ప్రారంభ మవుతాయి. ఈయన విజయశాంతి నాయికగా రూపొందిస్తున్న "ఆడవిరాణి" చిత్రం మే నెలలో విడుదలవుతుంది. మోహన్‌బాబు చిత్రం "ఇండియా టుడే" త్వరిత గతిన తయారవుతోంది.

### చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

డాక్టర్‌ను హత్య చేసి ఆ హత్యను రుద్రయ్య భార్య పార్వతమ్మ (జయసుధ) మీద మోపుతాడు. విజయ్ పార్వతమ్మను మొదట అరెస్టు చేసినా, ఆ తర్వాత నిజం తెలుసుకొని, రిక్షా రుద్రయ్య సహాయంతో రౌడీ మూకను అంత మొందిస్తాడు. డియస్పీ, రిక్షా రుద్రయ్య కాళ్ల మీద పడేట్లు చేస్తాడు. ఇదీ కథ.

## జిల్లావార్తలు

5పేజీ కొరవ

దుంగలను పట్టుకొనే దమ్ములు లేని అధికారులు ఈ విధమైన కక్కుర్తికి పాల్పడడం విమర్శలకు దారి తీయడమే గాక ఆ శాఖ పరువును మరింత దిగజార్చింది.

### కోటి మందికి ఒక క్రీడాకారుడూ లేడు!

గూడూరు దువ్వూరు రమణమ్మ మహిళా కళాశాలలో జరిగిన ఎస్.వి. యూనివర్శిటీ ఇంటర్ కళాశాలల మహిళా టోర్నమెంట్స్ ముగింపు సమావేశానికి గుంటూరు రేంజ్ డి.ఐ.జి. సి.ఎన్. గోపినాథ్ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. 14 ఏళ్ల క్రితం నేను గూడూరు ఏఎస్పీగా పనిచేసి నప్పుడు మహిళా కళాశాల ఏర్పాటుకు కృషి ప్రారంభ మయ్యింది. విద్యార్థినులకు క్రీడలపై వున్న ఆసక్తి గుర్తించి తగిన శిక్షణ ఇస్తే మరింత ముందుకు పోగలరు. 85 కోట్ల జనాభా గల దేశంలో కోటికి ఒక్కరైనా ఉత్తమ క్రీడాకారుడు కాకపోవడం దురదృష్ట కరమన్నారు. స్వయంకృషితో వెయిట్ లిఫ్టింగ్‌లో ప్రపంచ రికార్డు సృష్టించిన శ్రీకాకుళం అమ్మాయి మల్లేశ్వరికి ప్రభుత్వం తగిన ప్రోత్సాహం ఇవ్వక పోవడం దౌర్భాగ్యమని చెప్పారు. స్వయం కృషితో ఎదుగుతున్న క్రీడాకారులకు స్వచ్ఛంద సంస్థలు సహాయ పడాలని ఎస్.పి పూర్ణచంద్ర రావు కోరారు. కార్యక్రమంలో కళాశాల కార్యదర్శి డాక్టర్ పి.ఆర్. రెడ్డి, డి.ఐ.జి. సతీమణి కళారెడ్డి, ప్రిన్సిపల్ కె.మెహర్ మణి, చదలవాడ వెంకటేశ్వర్లు నాయుడు పాల్గొన్నారు. డిఐజి సతీమణి విజేతలకు బహుమతులు అందజేశారు.

### ఎన్.బి.కె.ఆర్. కళాశాల ప్రిన్సిపాల్‌కు వీడ్కోలు

వాకాడు ఎన్.బి.కె.ఆర్. సైన్సు అండ్ ఆర్ట్సు కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవీ విరమణ చేసిన దువ్వూరు బాలకృష్ణా రెడ్డికి 3 తేది కళాశాల యాజమాన్యం, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బంది ఘనంగా వీడ్కోలు పలికారు. డాక్టర్ జి. సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించిన సభలో కళాశాల కరస్పాండెంట్ నేదురుమల్లి పద్మనాభ రెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. బాలకృష్ణా రెడ్డి ఆదర్శ ప్రాయుడైన ప్రిన్సిపల్. ఆయన పద్ధతులు ఇతరులు అనుసరించాలి. పదవీ విరమణ చేసినా వాకాడు - విద్యానగర్ విద్యా సంస్థలతో నిత్యం సంబంధాలు కల్గి వుంటారని చెప్పారు. బాలకృష్ణా రెడ్డిని దుశ్శాలువతో సత్కరించి బంగారు వుంగరం బహూకరించారు. సన్మాన గ్రహీత మాట్లాడుతూ విద్యా సంస్థ తోపాటు తాను పెరిగానని, తల్లి ఒడిలాంటి విద్యా సంస్థను మరవ లేనన్నారు. సభలో అధ్యాపకులు టి. మధుసూదన రెడ్డి, ఎన్. ఖాజా మొహియుద్దీన్, వి.శ్రీనివాసులు, సి.రాజగోపాల్, ఆర్.బి. రాజరత్నం, డాక్టర్ బి. వనజాక్షమ్మ తదితరులు మాట్లాడారు. కళాశాలలో పాతిక సంవత్సరాల నుండి పనిచేస్తున్న 12 మంది సిబ్బందిని కూడా యాజమాన్యం సన్మానించింది. సభారంభంలో ప్రార్థనా గీతం ఆలపించిన ఎస్.వి. రమణ మూర్తి చివరన వందన సమర్పణ చేశారు.

### అక్షరకవి ఉద్యమ సేవకు నల్లమల సహకారం

ఎక్కడ అక్షర దీపం, ఆరోగ్య దీపం వర్క్ షాపులు జరుగుతుంటే అక్కడ ప్రత్యక్షమై వుద్యమాలకు సంబంధించిన అంశాలపై కరపత్రాలు పంచుతుంటారు పిగిలం హైస్కూల్ హిందీ టీచర్ వరదా శ్రీనివాసులు. తన జీతంలో నెల నెలా కొంత మొత్తం వుద్యమ ప్రచారానికి వెచ్చిస్తూ కవితలు, కథలు, వ్యాసాలు వ్రాస్తుండే శ్రీనివాసులుకు అప్పటి జిల్లా కలెక్టర్ కె. రాజా కొంతమేర సహాయ పడడమే కాకుండా సత్కరించి గౌరవించారు. శ్రీనివాసులు చేస్తుండే సంఘ సేవకు స్పందించి సిపిఐ రాజ్యసభ సభ్యుడు నల్లమల గిరిప్రసాద్ 1,116 రూపాయల చెక్కు పంపించి వుద్యమానికి తన వంతు సాయంగా వెచ్చించ మన్నారు. శ్రీనివాసులు ఇప్పటి వరకు వుద్యమాలకు సంబంధించిన 52 రకాల కర పత్రాలను 75 వేలకు పైగా పంచిపెట్టారు. 5 పుస్తకాలు వ్రాసి వుచితంగా పంపిణీ చేశారు.




### దక్కిలిలో వ్యభిచారం, కోడిపందాలు !

పోలీస్ స్టేషన్లకు రాబడి వుండాలంటే కొన్ని విషయాలను పట్టించు కోకుండా వదిలేయాలి. ఈ సూత్రాన్ని దక్కిలి పోలీసులు తు.చ. తప్పకుండా పాటిస్తున్నారు. పోలీస్ స్టేషన్ పరిధిలోని పలు గ్రామాల్లో కోడి పందాలు, దక్కిలిలో వ్యభిచారం యధేచ్ఛగా జరుగుతున్నాయి. మర్లగుంట, వెలికల్లు గ్రామాల్లో పందెం కోళ్లకు తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల నామధేయాలతో వేలాది రూపాయల పందెం కాస్తున్నారు. వీటివల్ల గ్రామాల్లో గందరగోళ పరిస్థితులు ఏర్పడుతున్నాయి. మామూళ్లకు అలవాటు పడ్డ పోలీసులు ఇవన్నీ పట్టించు కోవడం మానేశారు. పోలీస్ వున్నతాధికార్లు ఈ విషయం చక్కదిద్ద వలసిన అవసరం వుంది.



## ఉత్తరక్రియలు



జననం:28.16.1914 మరణం: 9.1.95

మా అభివృద్ధికి కారకులు

**దువ్వూరు జానకిరామిరెడ్డి గారు**

(ఇనమడుగు)

9.1.1995 తేది సోమవారం స్వర్గస్థులైనారు

వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

ఉత్తరక్రియలు

| | | |
|---|---|---|
| 18.1.1995 తేది | బుధవారం | - నిలువు |
| 19.1.1995 తేది | గురువారం | - ఎత్తురేవు |

నెల్లూరు వెంకట్రామపురంలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

భార్య: దువ్వూరు బుజ్జమ్మ

కుమారుడు - కోడలు

దువ్వూరు వెంకట కృష్ణారెడ్డి - కామాక్షమ్మ

కుమార్తెలు - అల్లుళ్లు

| | |
|---|---|
| తిక్కవరపు హనుమాయమ్మ | బాలకృష్ణారెడ్డి |
| వేమారెడ్డి శకుంతలమ్మ | రామసుబ్బారెడ్డి |
| దొడ్ల సౌజన్యమ్మ | లక్ష్మీనారాయణ రెడ్డి |
| పొక్కిరెడ్డి విజయలక్ష్మమ్మ | |
| పెళ్లకూరు అరుణమ్మ | పెళ్లకూరు అమరేంద్ర రెడ్డి |

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,